# విద్ధసాలభంజిక

(రాజశేఖర కవికృతము.)

కైలాసవాసి ?

జనమంచి వేంకటరామయ్య ఆంధ్రీకరణము.

ఓమ్!

నమయనుచుఁ మ్రొక్కియిటు పూ
ర్వమహాకవులకుఁ బడయఁగఁ బ్రార్థింతుమఁ గన్
విమలయును, నాత్మకళయును
నమృతాకృతియు నయి యొప్పు నవ్వాణికృపన్!

# వి ద్ధ సా ల భ ం జి క

## —: ఈ నా టి క లో ని పా త్ర లు :—

విద్యాధరమల్లుడు—రాజు

భాగురాయణుడు—మంత్రి

చారాయణుడు—విదూషకుడు

హరదాసుడు—మంత్రిశిష్యుడు

దూత: ప్రతీహారి: మొదలైనవారు



దేవి—పట్టమహిషి

మేఖల—దేవిపరిచారిక

మృగాంకావళి } నాయికలు
కువలయమాల }

బ్రాహ్మణి—విదూషకునిభార్య

కురంగిక }
తరంగిక }
విచక్షణ } చేటికలు
సులక్షణ }

Read 3 or 4 times this introduction

# ప్రవేశిక

Rao

ప్రసిద్ధకవులున్నూ, యశశ్శరీరులున్నూ. అయిన శ్రీజనమంచి వేం
టరామయ్యగారు, ఆంధ్రీకరించిన విద్ధసాలభంజికను గీర్వాణభాష
రచించినకవి రాజశేఖరుడు. ఇతడు సంస్కృత వాఙ్మయంలో రూపక వి
యితగానేకాక కావ్యమీమాంస అనే ప్రసిద్ధ సాహిత్యగ్రంథం రచించి
విఖ్యాతాలంకారికులలో పరిగణింపబడినవాడు బాలరామాయణము బాలభా
రతము కర్పూరమంజరి విద్ధసాలభంజిక అనేవి ఇతని రూపకాలు. ఈరూ
పకాలలో "విద్ధసాలభంజిక" నాటిక. నాటికలో ధీరలలితుడు నాయకుడుగా
ఉండవలెననీ, శృంగారము ప్రధాన రసముగా వర్ణించవలెననీ, నాలుగంకా
ములే ఉండవలెననిన్నీ ముగ్ధను నాయికగా కూర్చవలెననీ — ఇంకా
ఇత్యాది లక్షణాలు కొన్ని ముఖ్యముగా వర్ణించవలసినవనీ, లక్షణకర్త
లైన ఆలంకారికులు నిర్ణయించారు.

రాజశేఖరుడు క్రైస్తవశకం ౯ వ శతాబ్ది అంత్యభాగంలోనూ, ౧౦
శతాబ్ది ప్రారంభంలోనూ, జీవించిఉన్నవాడు. ఈకవి కర్పూరమంజరిలో
తాను కన్యాకుబ్జ ప్రభువైన మహేంద్రపాలునికి ఆచార్యత్వం వహించినట్లు
వర్ణించుకొన్నాడు. మహేంద్రపాలుడు క్రైస్తవశకం ౯౦౭ ప్రాంతంలో
రాజ్యం పరిపాలించినట్టు చరిత్ర నిదర్శనాలు ఉన్నాయి. తరువాత కలచు
వంశీయుడున్నూ, త్రిపురీ ప్రభువున్నూ, అయిన యువరాజ కేయూ
వర్షుని సభలో విద్ధసాలభంజిక ప్రదర్శింపయినట్టు తెలుస్తుంది
పిమ్మట, అసమగ్రంగా లభించిన బాలభారతంలో, మహేంద్రపాలు
అనంతరం రాజ్యంచేసిన మహీపాలుని ఆజ్ఞానుసారం ఆనాటకం రచిం
నట్లు, కవి ప్రకటించుకొన్నాడు. ఈమహీపాలుని శాసనాలు క్రైస్తవశక
8/4 ౯౧౪ నుండి మనకు లభిస్తున్నాయి. కాబట్టి, పైకారణాలచేత, రాజశే
రుడు ౧౦ వ శతాబ్ది ఆరంభంలో జీవించి ఉండవచ్చునని సంస్కృ

వాఙ్మయ * చరిత్రకారుడైన A. Berriedale keith పండితుని అభిప్రాయము.

మనకు తెలిసినంతవరకు, అశ్వఘోష మహాకవి మొదలు "అనర్ఘరాఘవము"వరకూ, సంస్కృతవాఙ్మయంలో ఉత్కృష్ట రూపకాలు వెలిశాయి. తరువాత దేశభాషల అభివృద్ధి వల్లగాని, విదేశీయాక్రమణవల్ల దేశంలో ఏర్పడిన అశాంతివల్లగాని, క్రమంగా సంస్కృతరూపకాలలో జీవం సన్నగిల్లిన ౯వ శతాబ్దం మధ్యభాగంలో ఉన్న మురారికవి అనర్ఘరాఘవంతోనే, అనుకరణమూ, కేవల పాండిత్య ప్రదర్శనమూ రూపకాలలో ప్రారంభమైనాయి. కవులు రూపక స్వరూపమూ, ఆదర్శమూ మరచి, అలంకార గ్రంథాలే లక్ష్యంగా ఉంచుకొని, నిర్జీవమైన రూపక రచన ప్రారంభించారు.

మురారికవి తరువాత ఉద్భవించిన రాజశేఖరుని రూపకాలలో కూడా కథా సంవిధానంలోనూ, కూర్పులోనూ, ఉత్కృష్టనైపుణి ఏమీ గోచరించదు. మొత్తంమీద రూపకరచనలో అతనికి స్వతంత్రప్రతిభ లేదన్నమాట వాస్తవము. విద్ధసాలభంజికలో అంతటా రత్నావళీ మాళవికాగ్నిమిత్రాల అనుకరణాలు అన్ని విషయాలలోనూ, గోచరిస్తాయి. పాత్రస్వభావోన్మీలనము అతనికి తెలియదన్నా సాహసంకాదు నాటికలో పాత్రలన్నీ, సామాన్యంగా, యంత్రప్రతిమలవలె చైతన్యరహితంగా కదులుతూ ఉంటాయి. కవిమాత్రం ఆలంకారికుల నాటికాలక్షణం ఏమరకుండా అనుసరించినమాట నిశ్చయము.

కాని రాజశేఖరకవి కవనంలోమాత్రం సౌందర్యం లేదనలేము. శైలి లలితలలితంగా ఒయ్యారంతోనూ, తూగుతోనూ, నడుస్తుంది. వర్ణనలు మనోహరంగానూ, కొన్నిపట్ల సహజంగానూ ఉంటాయి.

* "Sanskrit Drama" Page 232.

క్షేమేంద్రకవి అన్నట్లు శార్దూలవిక్రీడితం నడిపించడంలో అతడు సిద్ధహస్తుడు. ఇంకా వసంతతిలకాదివృత్తాలలో కూడా అతని ప్రత్యేక పుణ్యం కనబడుతుంది. క్వాచిత్కంగా పాత్రమనోవృత్తికూడా విస్పష్టంగా వర్ణించగలడు. ప్రధానంగా కావ్యమీమాంసా రచనవల్ల అతనికి స్థిర యశస్సు లభించినా, రూపకాలలోని కవితాసౌందర్యంచేత, సంస్కృతవాఙ్మయంలో కవికి ఒకవిశిష్టస్థానం ఏర్పడినదని మనం అంగీకరించకతప్పదు.

అనువాదకులు శ్రీజనమంచి వేంకటరామయ్యగారు, ౧౮౭౭వ సంవత్సరంలో జన్మించినవారు. వారికవితారీతి ముఖ్యంగా నవయుగం వైపు అభిమానించినా, వీరేశలింగయుగచిహ్నాలముద్ర వారిలో గోచరిస్తుంది. వీరేశలింగయుగంలోని కొందరుప్రఖ్యాతకవులవలె, ఆయన కూడా మొదట అనువాదరచనలతో తనయశోహర్మ్యం నిర్మించదలచినట్లు కనబడుతుంది. మొట్టమొదట వారిలేఖిని భవభూతిమహాకవి మాలతీమాధవం అనువాదంలో ఆరితేరింది. పిమ్మట ౧౯౦౬లో—'ప్రౌఢనిర్భర వయఃపరిపాకంలో'—వారు రాజశేఖరుని విద్ధసాలభంజిక అనువదించారు. ప్రథమమైన ఈ నాటికానువాదము బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారి "మనోరమ" పత్రికలో ప్రకటింపబడ్డది. వెంటనేభవభూతి మహాకవి "ఉత్తరరామచరితము" ఆంధ్రీకరణంప్రారంభించినట్లున్నూ అనువాదరచనలో క్రమంగా అరుచిజనించ అదితాత్కాలికంగా విరమించుకొని తరువాత అనువదించినట్లున్నూ ౧౯౨౭లో ప్రకటించిన "నవకుసుమాంజలి" పీఠికవల్ల మనకు తెలుస్తూ ఉంది.

సరిగా ఆకాలంలోనే వారిలేఖిని ఎక్కువగా నవ్యవైఖరిలో నృత్యం చేసినట్లు కనబడుతుంది. "నవకుసుమాంజలి"లో ఖండకావ్యాలన్నీ క్రమక్రమంగా ఆకాలానికి సమీపంలో వ్రాసినవే. ఆసమయంలోనే సమగ్రంగా అనువదించిన వారి "ఉత్తరరామచరితము" ఇప్పటికీ అప్రకటితంగానే ఉండిపోయింది. ఆ ఆంధ్రీకరణం వారు చదువుతూవుండగా వినేభాగ్యం ఒకప్పుడు నాకు కలిగింది. అది ఈపాటికే ప్రకటింపవలసిన ఆంధ్రీ

కరణము. అప్పుడే వారు "మేఘదూతం" కూడా భాషాంతరీకరించారు. అప్రకటితంగానే ఉండిపోయింది. ఆసమీపకాలంలోనే నూతనఫణితిలో కావ్యమార్గంలోను, రూపకమార్గంలోనూ, వారు స్వతంత్రకృతినిర్మాణం చేయవలెనని సంకల్పించి, కొన్నిరచనలు కూర్చి, ధన్యులైనారు. కాని గాకతిలోనే కైలాసవాసులయిన వారి వాఙ్మయమనోరథాలు, చాలావరకు సంకల్పాకారంలోనే ఉండిపోయాయి.

సామాన్యంగా కవులలోనైనా, వ్యక్తులలోనైనా, నలభై సంవత్సరాల వయఃపరిమితివరకు స్వీకరించిన సంస్కారాల ప్రతిముద్రలే ఆజీవితాంతమూ, గోచరిస్తూ ఉంటాయి. ఆయనవార్ధక్యంలో కొన్నిపట్ల వాఙ్మయ విప్లవవాదులైనధీరులు. వీరేశయుగంలో జన్మించినవారైనా, తమయుగంలోనూ, నవ్యయుగంలోనూ, ఉండేగుణాగుణాలను నిశితంగా గ్రహించిన ద్రష్టలు. "నవకుసుమాంజలి"లో వారి అమూల్యవాఙ్మయాభిప్రాయాలన్నీ ఆటవెలదులలోనూ, మధుంగీతికలోనూ, ఏర్చి కూర్చారు. ఆఅభిప్రాయాలతోఅన్నింటితోనూ మనం ఏకీభవించలేకపోయినా వానిలో అంతటా వారి సునిశితకవితాదృష్టి గోచరిస్తుంది.

అన్యభాషచదివి ఆనందించలేని చదువరులకు మూలకావ్యంలోని సౌందర్యం సాక్షాత్కరింపచేయడమే అనువాదకుని ఆదర్శధర్మము. నేటికాలపు ఆంగ్లేయభాషలోని భాషాంతరీకరణాలన్నీ ఈఆదర్శంకలవే. కాని ఆంధ్రుల పురాణానువాదాలు సగంఅనుకరణాలు, సగం స్వీయకృతులున్నూ దీనివల్ల మూలకారుని గుణాగుణాలనూ, అనువాదకుని గుణాగుణాలనూ తూచి నిర్ణయించడం దుష్కరం అవుతుంది కనుకనే ముఖ్యంగా భారతాంధ్రీకరణంలో ఈసమస్య మరీక్లిష్టతరమైపోయింది. మూలకారుడున్నూ, అనువాదకుడున్నూ, సమానమైన కవితా సామర్థ్యం కలవారైనప్పుడు ఇక చెప్పనే అక్కరలేదు.

సుప్రసిద్ధ సంస్కృతనాటకాలను అనువదించిన ప్రబుద్ధకవుల ఆంధ్రీకరణాలు మూలదృష్టితో విమర్శించి నప్పుడు కేవలం ఛాయా మాత్రంగానే ఉంటాయి. అభిజ్ఞానశాకుంతలం అనువదించిన పిల్లల మర్రి పినవీరభద్రకవి కాళిదాసకృతినుండీ, వ్యాసమహాభారతంలోనుండీ, ఇష్టమువచ్చిన కథాభాగాలు సేకరించుకొని తనప్రబంధం కలగూరగంపగా కూర్చుకొన్నాడు. ''విద్ధసాలభంజిక'' ౧౪వ శతాబ్దంలో మంచన రచించిన ఆంధ్రీకరణంకూడా పైతరగతికే చెందుతుంది. కేయూరబాహుచరిత్ర లో మంచన పాత్రల నామరూపాలు పూర్తిగా మార్చివేసి, తన ప్రబంధం, మననాటికకు ఆంధ్రీకరణం అవును కాదో అన్నంతవరకు ప్రబంధ మార్గంలో కావ్యం కూర్చుకొన్నాడు. అయితే ప్రబంధకవులు తమరచన లను కేవలానువాదాలుగా ఉద్దేశింపలేదేమో అని అనుకోవలసి ఉంది. కాని ఆ ఆంధ్రీకరణం ఎంతవరకు సముచితమైనది అన్నప్రశ్న అప్పటికీ నిలిచేఉంటుంది.

సంస్కృతరూపకాలలో కవులు పాత్రోచితములైనభాషలు వాడే వారు. కానిప్రబంధకవుల అనువాదాలలోనూ, ఇటీవల వీరేశలింగయుగం లోవారి కొన్ని ఆంధ్రీకరణాలలోనూ, అనువాదకులు ఈపాత్రోచితభాష వాడవలెనని ఉద్దేశించినట్లే కనబడదు. కారణము వారిగ్రాంధికభాషాభినివే శమేమో! శ్రీ వేంకటరామయ్యగారుకూడా, పాత్రోచితభాషాంతరీకరణం చేయలేదుగాని ప్రాకృతానువాదాలపట్ల వ్యావహారికభాషాసమీపంలో ఉన్న గ్రాంధికభాషవాడవలెనని ప్రయత్నించినట్లు కనబడుతుంది.

కాని మూలనాటికలో ఉన్న రెండువాక్యాలుమాత్రం ఆయనఆంధ్రీ కరించకుండానే విడిచివేశారు. మూలంలో ప్రథమాంకములోని 30 వ శ్లోకం పిమ్మట—

* రాజా। సఖే! సంస్కృతేపి పగ్రిగల్భసే!
విదూషక తుమంపి అహ్మేరిస జణ జోగ్గే
పాట ఉగాగ్గే పవుత్తోసి"

* అనే వాక్యాలకు అనువాదం కనబడదు. వారు ప్రాంతోచితభాషానువాదం చేయకపోవడమే దీనికి కారణమని మనం ఊహించవలసి ఉంటుంది. ఇంకా కొన్నిపదాలకు ఆంధ్రంలో అనురూపమైన పదాలు దొరకక పోవడం వలనే కాబోలు— దుర్గ్రాహ్యములయినా కొన్నిమూల పదాలే ఆయన అనువాదంలో వ్యవహరించారు.

ఈలాంటివే ఇంకా ఒకటో రెండో పదాల అనువాదంలో ఉన్న దోషాలు విడిచివేస్తేమొత్తంమీదఆయన నాటికానువాదం సర్వాంగసుందరంగా రచించి కృతార్థులైనారు. శ్రీవేంకటరామయ్యగారు తమ ఆంధ్రీకరణానికి ప్రబంధకవులను గాక— పాశ్చాత్యులనే ఆదర్శంగా స్వీకరించి ఉండడం వల్ల, సంస్కృతానభిజ్ఞులకుకూడా రాజశేఖరుని కవితామాధుర్యం రుచిచూపించి కృతకృత్యులైనారు. ఒకప్పుడు మూలశ్లోకాల రసమాధుర్యం నాలుగుపాదముల పద్యాలలో రావడం దుష్కరమైనప్పుడు అవ పాదం వ్రాయడానికి కూడా వారువెనుదీయలేదు.

రాజశేఖరకవి సంస్కృతవాఙ్మయం చరమావస్థలో ఉదయించినవాడు: శ్రీజనమంచి వేంకటరామయ్యగారు ఆంధ్రవాఙ్మయంలో నవ్యత్వంతో పరమ ప్రారంభంలో ఉద్భవించినవారు. అందుచేతనే సంస్కృత నాటికలో లేని ఒకవిధమైన నవ్యసౌందర్యం వీరి అనువాదంలో అంతటా

* అనువాదం. రాజు: చెలికాడా! నీవు సంస్కృతమందును ప్రగల్భుడవే సుమా!

విదూషకుడు: నీవన్నా మావంటివారికి తగిఉన్న ప్రాకృతమార్గములో నే శంకరించితివే!

మెరుస్తూ ఉంటుంది. లలితపదబంధంలో మేటియైన రాజశేఖరుని కవిత కుకూడా, ఆయన, సున్నితమైనశైలిలో మెరుగుపెట్టినట్లు విస్పష్టంగా గోచరిస్తుంది. ముఖ్యంగా రాజశేఖరుని మధురప్రాకృత వృత్తాలకు వారు తీయని ఉత్సాహాదివృత్తాలు వాడి వన్నెతెచ్చారు. మృదులమైన సంస్కృత రచనలోనూ, అచ్చతెనుగుపదాలకూర్పులోనూ, కొన్నిపట్ల సంస్కృతాంధ్ర మిశ్రశైలిలోనూ, వారికవనం నన్నయభట్టారకుని శైలినిస్మరింపజేస్తుంది.

ఉదాహరణకుమాత్రం రెండు మూడుపద్యాలు:

"ఆమందమణినూపుర క్వణన చారుచారిక్రమం
ఝణఝ్ఝణిత మేఖలాక్వణిత తారహారచ్ఛటం
ఇదం తరళకంకణావళి విశేష వాచాలితం
మనోహరతి సుభ్రువః కిమపి కందుక క్రీడితమ్"

అం ౨ శ్లో ౬

కవిరాజ విరాజితము.

మణిమయనూపుర ఝిల్లిలశబ్దిత మంజులచారిపదక్రమముల్
ఝణఝణనాద వినోదలసద్రశనాగళ దుజ్జ్వలహారములున్
ప్రణుత తరోచ్ఛల కంకణఘల్లిల రావవిశేషమనోజ్ఞములై
ప్రణయిని కందుకకేళి హరించెడు బట్టి మదీయమనంబునహో!
కథం! తత ఆస్ఫాలిత శుక్తిసంపుటోన్ముక్త మౌక్తికచ్ఛాయాః
విసరంతు తవధౌతాంజనా నయనయోః బాష్పకణాః

అం ౨ శ్లో ౧౨

"చెలువరో కొ్రత్తగాఁ జటిలింపఁబడిన
చెలువంపు ముత్తెంపుఁ జిప్పలనుండి
రాలు ముత్తెములట్లు గ్రాఁ ననుశ్రీవుల
వాలుగన్నులనుండి వలదు రాల్పంగ."

"సౌధాదుద్విజతే, త్యజత్యుపవనం, ద్వేష్టి ప్రభామైందవీం
ద్వారాత్త్రస్యతి చిత్రకేళిసదసో వేషం మిషం మన్యతే
ఆస్తే కేవలమబ్జినీకిసలయప్రస్తారశయ్యాతలం
సంకల్పోపనమత్త్వదాకృతిరసాయత్తేన చిత్తేన సా॥

అం ౩ శ్లో ౨

ఉ. "ఆడదు పూవుఁదోఁట గొనియాడదు వెన్నెలతేట బోటులం
గూడదు కేళిమండపము గుమ్మమువంకను దొంగిచూడదున్,
వేడదు వేషపోషణము, వీడదు కెంజిగురాకుపాన్పు. బూఁ
బోఁడి తదీయనవ్యమృదుమోహనవేషవిభావనారతిన్.

ఇంకా వారివృత్తవైచిత్రికీ సంస్కృతాంధ్ర శైలీమాధుర్యానికీ ఉదాహరణలు ఈయవచ్చును, గాని కేవలం విస్తరభీతివల్ల విరమింప వలసివచ్చింది.

ఇటువంటి సుందరనాటికను కళాశాలావ్ఛాత్రులకు పాఠ్యగ్రంథంగా నియమించిఆంధ్రవిశ్వకళాపరిషత్తువారు నాటికఅర్హతను గురుతించడమే కాకుండా శ్రీవేంకటరామయ్యగారిని గౌరవించి తమగుణగ్రహణచాతురిని ఆంధ్రదేశానికి విశదీకరించారు.

శ్రీవీరేశలింగఆస్తికోన్నతపాఠశాల,
రాజమహేంద్రవరము
౧౩—౬—౪౦

పి. గణపతి శాస్త్రి
పండితుడు.

ఓమ్

శ్రీపరమాత్మనేనమః

# విద్ధసాలభంజిక

Title

ప్రథమాంకము

మ. అజలాకోటి కెవం డిడుం గులగురుం
డై కేలిదీక్షావిధిం;
బ్రబలస్నేహము రోహిణీప్రియుపయిం
బాటించు నెవ్వండు; చె
ల్లుబడిం గెల్చె సుమాస్త్రముల్ వయిచియే
లోకేశు నెవ్వండు; కొ
ల్వౌబడుంగా కల మన్మథుండు రతిలీ
లానాటికా సూత్రియై.

శివుడు

గీ. అల విరూపాక్షు చూపుచేఁ బొలిసిన మన
సిజునిఁ జూపులనే పునర్జీవితునిఁగఁ
జేయ వలఁతులై తజ్జయశీల లైన
వామలోచనల నెపుడు ప్రస్తుతింతు.

(తదేకాగ్రచిత్తతతో)

మ. ప్రియుగోనాసుని పేరిదండకడెప్పుం
బెన్పాముక్రై వేరుము
క్కయుఁ, దత్కంఠవిషంబుకై పటుమణుల్
పైకెఁ దాల్చి, తద్భూతశాం
తియునుం గోరి పఠించి గోత్రజరతీని
ర్దిష్టమతాంబుఁ, బీ
తియు సంభీతియుఁ బెండ్లివేళఁ గనుచున్
హిమవంతుని కూతురు దీర్చిట్టుత్రి మిమ్మామతన్.
(నాంద్యంతమున)

సూత్రధారుఁడు: (తెరవంకఁ జూచి) ఇప్పుడు శ్రీయువ రాజదేవ
పరిషదాజ్ఞ యేమో నాకుఁ దెలియకున్నది.
[తెరలోఁ బాడుచున్నారు]

ఉత్సాహవృత్తములు

వలపుగోలుపు టుడిగి రసము వట్టిపోయినట్టి కుం
దలత నిప్పుడునుం దలంచి దనకు దానికైన యా
చెలిమి బలిమివలనఁ గలుగు చిరతరానురాగసం
కలన మెచటఁ జెడునో యనుచుఁ గలఁగుచుండి యాత్మలో
పలను, దేఁటి దనదుప్రియను బలెను బరువపుఁన్ హాయల్
గలిగి యలరు చూతయష్టి లలితసూనదృష్టినిం

## ప్రథమాంకము

జెలఁగి కనులఁ గప్పుకొనెడుఁ జేర్చికొనెడు మెల్లఁ గం
పిలఁగఁ జేయుఁ గౌఁగిలించు వేడ్క ముద్దు వెట్టెడున్.

సూత్ర: (విని) ఓహో! షట్కర్మనిరతుఁడును, దాహికకుల సంజాతుఁడును అగు రాజశేఖరకవిచే విరచింపఁబడిన విద్ధసాలభంజిక యనునాటికలోని వస్త్వాపక్షేపము పాడఁబడుచున్నది! (ఆలోచించి) సరే యిప్పుడుశ్రీయువరాజదేవవిద్వత్సభవారి సెలవు దానినిఁ బ్రయోగింపవలసిన దని కాబోలు. అటయిన నేనుగూడ శిష్యులచే బాహ్యవేషమునుబట్టి హరదాసుఁడని పేర్కొనఁబడెడి మహామంత్రిభాగురాయణ శిష్యుని వేషమును సిద్ధపఱచెదను)

(ఆకాశమునందు) చెలికాఁడా! సోమదత్తా! ఏమంటివి? "అకాలజలదుని మున్మనుమనిగుణగణ మేల కొని యాడుచుండ లే"దనియా? విను,

క. ప్రకటరఘువంశమణి స
ర్వకలానిలయుఁడు మహేంద్ర పాలుం డెవ్వా
నికి శిష్యుఁ డట్టి పరహిత
సుకృతి నితని నేల యొరులు స్తుతి యొనరింపన్?

(గోష్ఠీగరిష్ఠుఁ డగుకృష్ణశంకరశర్మవాక్యము లాలకించి)

చ. శ్రవణరసాయనంబు గొని
త్రావను, గోవిదు లిచ్చ మెచ్చ మే
ల్కావసము సేయనున్, రసత
రంగిణి యవ్వలియొడ్డుఁ జేరనున్,
భవతరుసారసత్ఫలముఁ
బట్టి భుజింపను గోర్కెయేని, యో
యి వినుమి రాజశేఖర క
వీంద్రసుధామధురోక్తు లాడటన్.
(నిష్క్రమించుచున్నాఁడు)

ఇది ప్రస్తావన.

[తరువాత హరదాసుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

హర: (శిరఃకంపము చేసి) అహాహా! ప్రజ్ఞాప్రకర్షము సర్వో
త్కృష్టమైనది గదా!

ఉత్సాహ: సిరుల నొసఁగు, దొసఁగు లడఁచుఁ
జిరయశంబుఁ గూర్చెడున్;
మఱియు సంశయంబు వేరి
మలిన మెల్లఁ జెఱిచెడుం;
గరము సంస్కరించి శౌచ
కలన శుద్ధిఁ జేసెడున్,

సారిదిఁ గామధేనువౌ వి
శుద్ధబుద్ధి యెన్నఁగన్.

ఈయంశము విశేషించి మాగురువుగారిచర్యలవల్లఁ దెలియఁబడుచున్నది. ఏమంటేని,

చ. కొడుకులు లేక లాటపతి
కూఁతునె కొండొకకారణంబుచేఁ
గొడు కని చెప్పుకొంట విని,
గూఢముగా నల రాజపుత్త్రి ని
ప్పుడు ప్రభుదర్శనార్థ మయి
పుత్త్రిమిషంబునఁ దోడి తెచ్చి ని
య్యెడకును మంత్రి నిష్కపట
వృత్తిని; బుద్ధివిశేష మేమనన్.

(ఆకాశమునందు) అయ్యా! చారాయణ! యేమంటివి? "అంతఃపురములో వేలకొలఁది నాయికలు పడియుండఁగా మహారాజున కిప్పుడామె లేదని ఖేదముగానున్నదా యేమి?" అనియా? అట్లుగా దట్లుగాదు. దీని కొక్కరహస్యముకారణమున్నది. అది కార్యము సిద్ధించినవెనుకఁ దెలియఁబడఁగలదు.

[తెరలో]

ప్రత్యూషముఖప్రతిబుద్ధు లగుదేవరకు సుప్రభాతము! ఇప్పుడు,

చ. తళతళ విచ్చుఁగత్తుల వి
　　ధంబునఁ గ్రాల్ నెలవెల్గు లేరిపే
రలుకలఁ జెండివేయ నన
　　మర్థము లయ్యెనొ, యేరియందుఁ గో
యిలల కుహూరవంబు లవి
　　యెందులకుం గొఱగాకపోయె, న
మ్మొలఁతలు కమ్మదెమ్మరలు
　　మెల్ల నొడళ్ళను సోఁక వేఁకువన్
గలఁతలు దీఱె వల్లభుల
　　కాళ్ళపయిం బడుచున్నవా రహో!

[మరలఁ దెరలో]

ఓహో! వందిబృందారకులారా! మంత్రిగారిచే మహారాజుగారికొఱకు నిర్మింపఁబడిన వాసభవనముచేరువ నంతఃపురమునందలి సుందరీమణులు మిమ్మునుగూర్చి యిట్లు పలుకుచున్నారు. "శ్రీవిద్యాధరమల్లదేవుఁడు పడక విడిచి తడవయినను మీ రిప్పుడు ప్రభాతభోగావళిం బాడక యూరకున్నవా రేమి?" అని (అందే) జయజయ! ఉజ్జయినీభుజంగ! దేవరవారికి సుప్రభాతము! ఇప్పుడు,

చ. నిలిచెఁ బురాణవక్త్రిమ
ణిచ్ఛవిఁ జుక్కలు రెండుమూఁడు; వె
న్నెల కడుఁగ్రోలి మైమఱచి
నిద్దురఁ జెందెఁ జకోరభామినుల్;
వడిచిన తేనెపట్టు బలె
వాడిశశాంకుఁడు గ్రుంకె వారుణిన్;
బలపడెఁ దూరుపుం దెసను
బాలబిడాలవిలోచనప్రభల్.

మఱియు

చ. మెలఁతలయల్కఁ దీర్చుచును,
మేడలయందుఁ గపోతహుంకృతుల్
బలియఁగఁ జేయుచున్, సుకవి
వర్యులకుం బ్రతిభల్ ఘటించుచున్
జెలఁగుఁ బ్రభాతతూర్యపటు
నిస్వన మంబరవీథిఁ, బాంసుశ
య్యలపయినుండి యుల్కిపడి
యప్పుడె లేచు నృపాల సామజం
బుల పదశృంఖలాధ్వనులఁ
బుష్టి వహించినదై మహోద్ధతిన్.

హార: దేవరవారు జేపకడనే మేలుకొనుటకూడ మంత్రిగారి మంత్రిప్రభావ మనియే తలఁచుచున్నాను. ఎందు వలన ననఁగా,

క. కారువులం బిలిపించి ధ
గారమణునిమిత్తము సుషిరస్తంభ సుసం
చారముఁ గృత్రిమశయనా
గారముఁ గట్టించె మంత్రి కౌశల మెసఁగన్.

కాఁబట్టి నేనుగూడ సుషిరస్తంభసంచార మగుశయనాగారమును నిర్మించినవారికిని, అనిర్వచనీయమైన రామణీయకమునకాస్పదమగురతనాలచవికెను విరచింపఁగల యితరశిల్పులకును మంత్రిగారిసెలవుచొప్పునఁ గనకరత్నాదిక మిప్పించుటకు మహారాజుగారి భాండాగారమునొద్దకుఁ బోయెదను.

(నిష్క్రమించుచున్నాఁడు.)

ఇది విష్కంభము.

[తరువాత సోత్కంఠుఁడై రాజును, గుమ్మములో నిలుచుండి
విదూషకుఁడును, బ్రవేశించుచున్నారు.]

రాజు: (ఒడలు విఱుచుకొనుచు లేచి)

సీ. అది ముద్దుమొగమేని హరిణాంకకథలెల్ల
దుదముట్టు నేఁటితో ధ్రువముగాను,
అది మేనిజిగియేని యలమెఱుంగుపసిండి
హా! యెంతతపియింపఁజేయఁబడునో!
అది కన్నుఁగవయేని విదితంబు
నల్లగల్వలు పన్నిదంబోడి పఱచు టెంక
అది మొల్కనగవుతీరగునేని
యమృతంబు నెవ్వరైన మూచూతురేమెఱింగి?
యేల మరువింప్లు కన్బొమలేని యవ్వి?
యేల బహుభాష లాడంగ? నిపుడు నిక్క
వముగఁ జెప్పంగవచ్చును బ్రహ్మసృష్టి
క్రమము పునరుక్తిదోషవిరహిత మనుచు.

విదూ: (చేరఁబోయి) దేవరకు స్వస్తి!

రాజు: (పయిపద్యమునే చదువుచున్నాఁడు.)

విదూ: హిహీ! ప్రియవయస్యుని ప్రాభాతికపఠనక్రమము పూ
ర్వకముగా నున్నది!

రాజు: (వినిపించుకొనక మరల నట్లే చేయుచున్నాఁడు.)

విదూ: ఓహో! ఏమి యితనిహృదయము బొత్తుగాఁ జెదరి పోయినది! ఇది యేమయి యుండును? (ఆలోచించి) కానిమ్ము. అడిగి సదుత్తరము చెప్పెడి వఱకును వదలి పెట్టను. ముచ్చికగిల్లి పిండకుండిన మామిడిపండులో నుండి రసమురాదుగదా! పండి పగులనున్న దానిమ్మ పండువలెనే తెలిసికోవలె నన్నకుతూహలముచే నా హృదయము పట్టరాకున్నది. (ఎదుటికివచ్చి ప్రకాశముగా) కార్యరహస్యమదేదియో యున్నదియున్నట్టు నాకుఁ జెప్పి ప్రియవయస్యుఁడు నన్నుమన్నించును గాక!

రాజు: (అతని కభిముఖుఁడై చూచి) ఓహో! మిత్రుఁడా చారాయణ! ఏలచెప్పను? రహస్యమును సుహృత్తులతోఁ జెప్పుకొన్నప్పుడు చింతాభరము పంచుకొనఁ బడుటచేతనో యనునట్లు హృదయము చులకఁబడును.

విదూ: అవహితుఁడనై యున్నాఁడను.

రాజు: -మ. పరివేషంబును బోలె వెన్నెలల శో
భందూల్చి, ప్రత్యూషమం
దఱచేగుంటెడు వెల్గొకండు కలలో
నయ్యెంగ నంగం; దదం
తరమందున్ సఖనిస్తుషీకృతశర
చ్చంద్రప్రభాంగంబుతోఁ

ప్రథమాంకము

దరుణీరత్న మొకర్తు కానఁబడి కం
దర్పాగ్ని కొప్పించె నన్.

విదూ: నీవు కేవలము స్త్రీలోలుఁడవు. నిన్నఁ గాక మొన్నను గదా నర్మదాతీరమునఁ గువలయమాల యనుకన్నియను జూచితివి? అందు నిమిత్తము నే నిప్పుడేదో యనుసంధానము చేయుచుండఁగాఁ దిరిగి యింతలోనే ఘుండుమీఁద సెలయన్నట్లిది యొకట్లా? బాగున్నది! ఊఁ తరువాత తరువాత,

రాజు: తరువాత.

క. తలఁపుం బలపము గొని హృ
త్ఫలకమునన్ మరుఁడు దిద్ది వ్రాసె ససంగన్
బోలుచు నల చెలువఁ బలుమఱుఁ
దిలకించుచు దానికే విధేయుఁడ నైతిన్.

(అని "అది ముద్దు మొగమేని" యను పూర్వోక్తపద్యమును జదువుచున్నాఁడు.)

విదూ: తరువాత, తరువాత,

రాజు: శ్రవణామృతమును వినుము. తేనియను జుఱ్ఱుము నయనామృతమును గ్రోలుము.

సీ. చారు కేరళవధూ స్మేరావదాతముల్,
పాణ్యాసిక ప్రౌఢ సారములును,

నగుగోవము త్తెంబు లప్పుడె

చంద్రోదయం బైనచందాన నవిరళముగఁ

బండువెన్నెల గాయుచుండంగఁ

దటుకున బటువుగుబ్బలమీఁదనటనమాడ

నీహారమును దీసి యేమని తెల్పుదు!

మదిరాక్షి "యోం నమో మన్మథాయ"

యనుచు నుత్కంఠ మత్కంఠమందు నునిచెఁ

జోద్య మయ్యెడు నీవంకఁ జూడుసఖుఁడ

మధ్యరత్నం బిదే కుంకుమంపుఁ బ్రభలఁ

బూయు జేగురు దిక్కుడ్యములకు నెల్ల.

విదూ: (యజ్ఞోపవీతమును చేతితోఁ బట్టుకొని) ఎండుదర్భల పేరును ధరించిన మహాబ్రాహ్మణుఁడను. నావాక్యము తప్పదు. స్వప్నము సత్యమగును. (తనలో) ఓరి! నీయాసలుడిగిపోను! తొత్తుకొడకా! స్వప్నేంద్రజాలిక! మహాబుద్ధిమంతులనుసయితము భ్రమపెట్టుచున్నావు (ప్రకాశముగా) తరువాత, తరువాత,

రాజు: తరువాత,

చ. ఎవతెవు నీవు బాల! యిట

కేటికి వచ్చినదానవంచు న

వ్యవధిగఁ గొంగువట్టి తనుఁ

బట్టఁగ నేఁ గమకించుడున్ వెసన్

భవనమునుండి యేకడకో
పైదలి యట్టె వినిర్గమించె నన్
దవిలిన చూపులం గలువ
దండలతో రణముల్ ఘటించుచున్.

విదూ: అప్పు డేకశయ్యాగతురా లైనదేవి యేమిచేసినది?

రాజు: చెదరినహారవల్లరులు
చిక్కువడంగ నితంబసీమపైఁ
బదములు తొట్రుపా టెనయఁ
బ్రస్ఫుటి బ్రన్ననిమేను వడంకు నొందఁగాఁ
గదిరినకోపభావమునఁ
గాంత గిరాలునఁ బాన్పు డిగ్గి య
య్యాదనను గంచుకుల్ గొలువ
నంతిపురంబున కేగె మిత్రుఁడా!

విదూ: ఓహో యేమి నీనాగరికత ! ఆమట్టుగ నెదురఁబడి దేవిని బుజ్జగింపనక్కరలేదా? చంద్రుఁడు కరములు చాఁచుచుండఁగావికాసము నొందకకలువతీఁగ యెంత సేపని యూరకుండఁగలదు?

రాజు: (ఖేదముతోఁగూడిన చిరునగవుతో) ధ్యానమంతయు నాచానమీఁదనే యుండుటచే దేవినిఁబట్టుకోనే లేక పోతిని. ఇంక నామెను బుజ్జగించుటయెట్లు?

విదూ: అలంకృతుఁడైన నటునిఁ జూచి యొకయిల్లాలు దగ్గఱ
నున్నతనభర్తకు ముండనము చేయించినదఁట! ఈ
మాట నేఁడు నీయెడ సత్యమైనది.

రాజు: (ఖేదముతోఁ గూడిన చిఱునగవుతో) ఓయాశాదేవీ!
నీకేదు రేదియు లేదు గదా? బాగుగా నాలో
చింపుము,

చ. దగగొని త్రావిరే నవసు
ధారసబిందులఁ జందువెన్నెలం?
దగుదు మటంచు సన్నబిస
తంతుల నేసిరె మేలిపుట్టముల్?
పొగడల కమ్మతావి క్రొలఁ
బోసిరె యెవ్వరుఁ గాని? స్వప్నమం
దగపడినట్టి యాకువల
యాక్షిని నేఁ గనులారఁ గంటకున్.

(స్మృతి నభినయించి వక్షస్థ్సలమునుజూచుకొని)

క. కలయో నిక్కువమో యిది
తెలియంగా రాదు; రెండు తెఱఁగులు గలదో
చెలి గానిపించ దది య
ర్మిలి నొసఁగినహారవల్లి వ్రేలుచున్ మెడలోన్.

ప్రథమాంకము

విదూ: ఒకవేళ నీకుఁ దెలియకుండ నేరాత్రివేళనో దేవియే తనహారమును దీసి నీమెడలో వైచి నిన్ను మోసపుచ్చినదేమో?

రాజు: (మదనాకూతము నభినయించి) స్వామీ! కామదేవ

మ. వదలంబోకు శరంబు; వివ్వీడువుమీ;
ఫాలాక్షు లక్షించవుమీ;
కదియన్ రాకు మమున్ శిరీషకలికా
కల్పంబు మా మానసం
బు, దయాబుద్ధి పరిగ్రహించి కృపణున్
బ్రోవంగదే; చూపఁగాఁ
గదె తత్స్వప్నమహాద్భుతంబు మరలం;
గన్గొందు నోమన్మథా!

విదూ: నీవు కలలో దొరకిన లడ్డుకములు పెట్టి యూరివారందఱకు విందుసేయఁ జూచుచున్నాఁడవు. చాలు నీపాటికి రమ్మా. పోయి దేవినిఁ బ్రసన్నురాలినిఁగాఁ జేయుదము. ఎప్పుడో దొరకఁ బోయెడి నెమలికంటె ప్రస్తుతము చేఁజిక్కిన తిత్తిరి మేలు.

రాజు: సరే నీయిష్టము.

విదూ: ఆస్థానమంటపమార్గమంతయు నీకుఁ బ్రణయప్రణామములు సేయవచ్చిన సామంతరాజమండలిచేఁ గిక్కి

ఱిసియున్నది. కాఁబట్టి యీపరిక్కఁగుమ్మమున మక రందోద్యానమును బ్రవేశించి పోదము. (అట్లు చేయు చున్నారు.)

[తెరలో]

దేవరవారికీ యవతరించుచున్న వసంతఋతువు సుఖ ప్రదమగుఁగాక! ఇప్పుడు

చ. అలరులు గ్రంథిగర్భముల,
నంకురమధ్యమునం జివుళ్లుఁ, గా
వలసిన యప్డు సిద్ధముగఁ
బంచమముం గలకంఠికంఠపుం
బిలమున నున్న విన్నియును;
వెండియు విల్గొని రెండుమూఁడుప్రా
ద్దులు గనెన్నేని సాధకము
తోన జగంబు జయించుఁ గాముఁడున్.

క. మునుమున్న విరహవతులను
బ్రేలు
నుమపను బ్రియసఖులు చూతమంజరుల వెసన్
మొన లెత్తకుండఁ గమ్మఁజు
నసనన్నఁ ద్రుంచుచున్న జాడలు గననౌ.

రాజు: ఓహో! సురభిసమయ మారంభ మైనది. ఇదిగో నిది యెల్ల మన్మథసైన్యసామగ్రియే!

విదూ: ఇదియేమి? వందిజనుల వచనమును బట్టి శిశుభావమును, నుపవనమునఁదోఁచు దానిం బట్టి స్తోకవిస్తారమును గల యీవసంతారంభ మనవరతసారంగ నేక స్పర్శ మృదులము లగు కేళివన స్థలముల నధికవిస్తారముగాఁ గానఁబడుచున్నది.

రాజు: మ. ఇదె షాణ్మాసికమార్తికాళి కెనయై
యింపొందెడున్ మల్లెపూ
లిదె తేఁటుల్ పయి వ్రాలఁ గింశుకసుమం
బీషద్వివృంతం బగున్
ఇదె బాహ్లీకిరదచ్ఛదారుణములై
యేపారుఁగంకేళి కా
చ్ఛదముల్; రక్తగుళుచ్ఛముల్ నవరుచిన్
సంధించెడుం బాటలిన్.

(ఆలోచించి)

గీ. కలను దత్కాంతఁ గనినట్టికనులతోడఁ
దఱుముకొని వచ్చు నీవసంతమును గంటిఁ;
దియ్యఁదియ్యఁగఁ దేనియ తేటఁ గ్రోలు
నోట నుడుకుఁబాల్ గ్రోలినపాటి గాఁగ.

విదూ: (ఇటునటు నడచి) నాదృష్టి యిప్పుడు తక్కినపుష్పవర్గము నంతయు డిగ్గ విడిచి కలమాంకురకూశ్మాండ

పాండరంబులగు సిందువారపుష్పములయందును, త్కృతా
లక్తకమాంజిష్ఠములగునశోకపల్లవములయందును, నిర్ధి
తమంజిష్ఠాధూసరితమనోహరంబులగు మాధవీసుమం
బులయందును, దధిశరసదృశంబు లగునవమాలి
కాముకుళంబుల యందును, ఇంచుకంత కలఁపంబడు
దుగ్ధంబు చందంబున ముగ్ధంబు లగువిచికిలప్రసూన
ములయందును దగిలి కలఁత నొందుచున్నది.

రాజు: ఇప్పుడు నీజవ్యాయం దన్నియు నుచితోపమానములే పుట్టుచున్నవి!

విదూ: (ఎదుట నిరూపించి) ఈప్రమదవనంబు తీఁగయాటకత్తెలకు రంగస్థలంబును, మలయమారుత సైంధవంబునకు స్వారిపట్టును, స్మరకిరాతునకు ఘోరారణ్యంబును, సమస్తకుసుమ సంతానంబునకు సంకేతస్థానంబును, హృదయంబున కమృతవర్షంబును, నగుచున్నది. ప్రియవయస్యుఁడిది యెల్లఁ జూచువాఁడై యిటు వచ్చుగాక!

రాజు: (పవనస్పర్శము నభినయించి)

చ. ఎవి పువుదీఁగ లూచు; నెవి
యింతులగుట్టులు నళ్ళఁబెట్టు; నె

య్యావి భువనత్రయిన్ గురువు
లై యనురాగరసంబుఁ దెల్పు; న
య్యావి కలకంఠకంఠముల
నద్దుచుఁ బంచమరాగరాజమున్
నవరగ వీచుఁ గామజయ
సాక్షులు దక్షిణగంధవాహముల్.

మఱియు

క. కలయిక యలయిక లడఁగఁగ
నలినలి గావించి తన్ను నాగులు గ్రోలన్
మలయానిలుండు వెండియు
బలుపుం గను, విరహిజనుల శ్వాసము పేర్మిన్.

విదూ: అవు నిది యిట్లే,

శా. లంకాతోరణమాల లూఁచి యవలీలన్,
సింహళ స్త్రీల యా
బింకం బెల్ల సడల్చి, ద్రావిడి స్మరా
వేశంబు నొందించి, యా
వంకన్ ముంగురు లొత్తి కన్నడికి,
నాపై లాటిఁ గుల్కించియున్,
సంకల్పించి మరాటి శూన్యహృదయన్,
జై త్రానిలుం డాడెడున్.

రాజు: ఈవసంతారంభ వేళను,

క. తుమ్మెదలు దిమ్ము సేయుచుఁ
గమ్మనపుష్పాదుల ధవళగాత్రము లలరన్
గమ్మనిపరిమళమ్ముల
కిమ్మగు నీసిందువార మిమ్ముగ నెనయున్.

విదూ: వయస్యా! ఈవింత లెంతసేపు చూచినను ఇంకను జూడనే మనసగు చుండును. కావున రమ్ము. పోయి మహామంత్రిగారు కట్టించియున్న 'కేళికైలాస' మను స్ఫటికశిలామందిరముం జూతము. (ఇటునటు నడచు చున్నారు.)

విదూ: ఎక్కడఁ జెప్పుమా క్వాంచీకేంకార సుందరమయి శబ్దమువలె వినఁబడుచున్నది!

రాజు: (వినుచు నాదిక్కు మొగముగాఁ బైకిఁ జూచి) సఖుఁడా!

శా. ప్రాకారాగ్రసమీపమందుఁ బరికిం
పం దోఁచు నీ కిప్పు డ
య్యాకాశంబును నైణముం దొలఁగి శీ
తాంశుండు దోతెంచి స
ట్లాణోన్నట్టిచకోరపాళి కమృతా
హారంబుఁ గల్పించుచుం
బాక శ్రీలవిపాండురరుచిం
బ్రాకించుచున్ వెన్నెలన్.

విదూ: వయస్యా! వేఁడీమెక్కడ?

రాజు: అదిగోనదిగో! (వెలుఁగుపాటుతోఁ జూచి) పోనీ. నీకిది యైనను గనఁబడుచుండలేదా? (వితర్కించి)

చ. వినఁబడు నిందు వీనులకు
వింపగుచున్ మణిమేఖలాధ్వనుల్,
మునుకొను నూర్పు తావికిని
మూఁగెడు జుమ్మని గండుతుమ్మెదల్
దనరెడుగీతికల్ స్థలద
లంకృతులై; యటుగాన దోలికా
ఘనతర కేళికాతరళ
క్రమము వైందవబింబమే సుమీ.

విదూ: నీవు చక్కఁగాఁ గనిపెట్టితివి. హిందోళదండికాశిఖరము లిక్కడకుఁ గనఁబడుచున్నవి.

రాజు: (మరలఁ జూచి) మిత్రుఁడా! ఈచంద్రుఁడాశ్చర్య చంద్రుఁడు సుమీ!

విదూ: ఏమిది! యీచంద్రుఁడు మనలతోఁ దొంగిదోఁబూఁచులాడుచున్నాఁడు

రాజు: (నిపుణముగా నిరూపించి) సఖుఁడా! ఏమి యదృష్టము! ఈచంద్రుని లావణ్యలక్ష్మిస్వప్నమందుఁ జూడఁబడిన యాముఖపద్మము ననుకరించుచున్నది.

విదూ: ఆలావణ్యలక్ష్మి యెట్లున్నది?

రాజు: పరిపాకపాండురము లగు శరకాండము లెట్లుండునో,

విదూ: ఏనికగున్నల మొలకదంతములును అట్లేయుండును. ఇప్పుడు హిందోళరాగధ్వని వినఁబడు చుండమింజేసి యాభాసురాంగి దాఁటిపోయిన దని తలఁచెదను. గనుక రమ్ము. ముందుకు పోదము. (ఇటునటు నడచు చున్నారు.)

విదూ: ఇదిగో 'కేళి కైలాసము.' ఇందుఁ బ్రవేశింతము (అట్లు చేయుచున్నారు.)

రాజు: ఇది యుద్దండడిండీరపిండపరిపాండుర తేజోనివాస మగు కేవలకైలాసముం బోలియున్నది.

విదూ: ఇదిగో నీలాభ్రభవనసంబునఁ బటికెంపురాతిగోడలపయి నెఱపంబడిన చిత్రకళాకౌశలము వంకఁ జూడుము. ఇదిగో నిక్కడ దేవితోఁగూడి పాచిక లాడుచున్నట్లు దేవర లిఖింపఁ బడినారు. ఇది 'నాగవల్లి' యనునడప కత్తె. ఇది 'ప్రభంజనిక' యను వీచోపుకత్తె. వీఁడు 'నగరకంకోకుఁ' డనువానరకిశోరము. ఇది పసన గుజ్జపు సాలయందలి 'టప్పరకర్ణ' మనుకుక్కుటము.

రాజు: సఖుఁడా! ఇదిగో నీవును వ్రాయఁబడితివి!

విదూ: (క్రోధముతో) నాయాకారమును లిఖించుటకు నన్నెవ్వ రెఱుఁగుదురు? నే నెట్లుందునో మాయింటి యాబిడకుఁ దెలియును. ఆమె నన్ను సాక్షాత్పరమేశ్వరుఁ డనిచెప్పు చుండును.

రాజు: ఉపవనమునందలి చిలుక యేమో పలుకుచున్నది. వినుము.

విదూ: ఏమని?

రాజు: "నీవు పరమేశ్వరుఁడవే కాని మఱి నందీశ్వరుఁ డెవఁడు?"

విదూ: దుర్జనాలాపముల కెవఁడు వీను లొగ్గును? (వ్రేలితో జూపించి) దాని కేమి గాని యీవంకఁ జూడుము. ఈమె యెవ్వతెయో కాని కాంతి విశేషముచే దేవిని ధిక్కరించుచు నపూర్వురాలుగా లిఖింపఁబడినది.

రాజు: ఈమె మన కపూర్వురాలు గాని మన్మథునికిఁ గాదు. (లెస్సగాఁ బరికించి) నామనస్సాగరచంద్రరేఖ యదియే యిది. ఓహో! యీమెరూపసంపద!

మహాక్కర

కలికికన్గవ నల్లగల్వలఁ గెల్చుఁ;
గాంతముఖము చంద్రసఖము చూడఁ
బొలఁతుకబొమలు వల జేసి వింటితమ్ములు;
నిగనిగల సొమ్మ్మంతి నెమ్మే
నలరుఁ గొండొక రేఖవా తెఱయందు,

నంగవల్లికయందు; నట్టిదీని
చెలువ మభివర్ణనము సేయఁ జాలునే
చిత్రజన్ముఁడుఁ జిరశిక్షలేక?

విదూ: (తనలో) దేవిగారి పరివారము నడుమ నీమె యెవ్వరు చెప్పుమా? (ఆలోచించి) తెలిసినది. కప్పముగట్టు నంతకుఁ బూఁటకాఁపుగా నిందుఁ గొలువ సేయ వచ్చి యుండిన మృగాంకవర్మ యను దేవిగారి మాతుల పుత్రుఁడు. స్త్రీవేషధారియై యెప్పుడును ఆమెచే మిక్కిలి గారవముతోఁ జూడఁబడుచున్నాఁడు. ఈపర మార్థము నెఱుఁగక చిత్రకారులు తాము చూచిన రీతిగా నామె నిందు లిఖించిరని తలఁచెదను. ఈరహ స్యము నిప్పుడు బైలుపుచ్చఁ గూడదు. ప్రియవయ స్యుఁడు కొంత విస్మయమునొందనీ. (ప్రకాశముగా) ఓహో! మిత్రుఁడా! అదృష్టవంతుఁడవు. ఈచిన్నది కన్నియసుమీ! దీని వేషరచనవలనఁ దెలియఁబడు చున్నది.

రాజు: ప్రియవయస్యుఁడు చెప్పినది నిజమే!

గీ. కన్నె యని వేషమే తెల్పు చున్న దిటను
వ్రాయఁబడుటను నీలిప్రావడ ధరించి
నట్టు; సతులకుఁ బాణిగ్రహంబు మొదలు
పోఁక ముడు లొప్ప నొప్పరుఁ గోకకట్టు.

(విమర్శించి)

ఉత్సాహవృత్తము

ఔర! మేనియొఱపహా! మహావిచిత్ర మిందుబిం
కేరుహాక్షి తన్నుఁ దా లిఖించుకొనియె నేమి స్వా
కార మచ్చుపడఁగ నన్నుచుఁ గలుగు సందియం బొకే
ధారగా రచింపఁబడుటఁ దప్పులేక రేకలున్!

(లెస్సగాఁ బరికించి) సందేహము లేదు. మకరధ్వజ వైజయంతి యగు నీయింతి యెవ్వతెయో కాని తన్నుఁ దానే లిఖించుకొన్నది.

విదూ: అవును. రసగ్రహణపారీణు లగుపెద్దలు గూడ నిట్లు చెప్పుచున్నారు—చిత్రకారునిం బట్టి చిత్రకర్మరూపరేఖయు, కవింబట్టి కావ్యబంధనైపుణియు నని—

రాజు: నీవు చెప్పినది యుక్తముగా నున్నది. గుణము లాకారము నాశ్రయించుకొనియుండును. మరియు, సఖుఁడా! చారాయణా!

చ. క్రమతఁ బరిస్ఫుటంబు లయి
క్రాలెడురేఖల నేపురూపు సం
గములను బూర్ణమూర్తి యయి
కన్పడెడున్ లఘురూపమందునున్
గమలదళాక్షి సాత్త్వికవి
కారచయంబు విధంబుగూడ భా

వముఁ బ్రకటించెడున్ మృగుల

వైఖరి నేర్పు దలిర్ప నొప్పుగన్.

విదూ: ఇందుఁగూడ మదనవతీముఖపరిచారికావృతురాలైన దేవి లిఖింపఁబడినది.

రాజు: ముందీరూపరత్నమునే మనసు సంభావింపవలయును.

విదూ: అటయిన నా సుందరి యింకను అగపడకున్నది.

రాజు: (తనలో) కన్నొకచోటను ఆపెరూపు కనుపట్టినను (విదూషకునితో) ఏదీ? యెక్కడ?

విదూ: ఇదిగో నిదిగో!

రాజు: (చూచి సోత్కంఠముగా)

గీ. కలువపూలఁ, గలువ చెలి, మృణాళములను
గదళి కాండములను గమలముల నె
వంతు సేసెఁ జెలి కతంబెపో నిర్మాత
యేకరీతి నునికి సృష్టిక్రమము.

విదూ: (స్తంభమునందు సాలభంజికనుజూచి) ఇదిగో నిదియు నదియే.

రాజు: నానేత్రచకోరచంద్రిక యిదియు నదియే. (చూచి సాభిలాషముగా)

గీ. అదియె పాల్గారుమేని సొ; రదియె మించి
కన్నె గేదంగి రేకులఁ గ్రాలు వాలుఁ

విదూ: ఇదిగో నిదిగో! చంద్రఖండపాండురంబు లయి తిర్య
క్ప్రసారితంబు లగు కటాక్షవీక్షణంబులచే దిఙ్ముఖం
బుల సుముఖంబులుగాఁ జేయుచు, పాణితలంబున
నశోకపల్లవంబుల రాగరంజితంబులుగా నొనర్చుచు,
చరణవిన్యాసంబున భృంగకులంబును బంకజశంకాసమా
కులంబుఁ గావించుచు నిదిగో నిందుఁ గనుపట్టుచున్నది.

రాజు: నీకోరినతీరున స్వప్నము సత్యమైనది. (చూచి) మసిమై
సమసిన కుసుమశరునిఁ దిరుగ బ్రదికించిన సంజీవనౌ
షధి యిదియేసుమీ! ప్రిదిలిన నాహృదయము సది
కించు విశల్యకరణౌషధియు నిదియే? (పరికించి)

ఉ. ఇంచుక భ్రూవిలాస, మొక
యించుక యంత ప్రగల్భవీక్షణం
బించుక గుబ్బచన్మొలక
లించుక లేనడుమున్ నితంబమున్
పంచకరంబు గాఁగ నెలజ
వ్వన మన్మరుకూర్మిచెల్మికాఁ
డుంచె ననంగఁ బొల్చెదుఁ ద
లోదరి కయ్యాయి యంగకంబులన్.

విదూ: విప్పొందిన కనుబొమలును, ఉదంగుళీక మగుహస్త
నాళీకమును గల యీయునికి చూడ నిప్పుడీ—
యేమో చేయుచున్నదానివలె నున్నది.

రాజు: క. క్రదలుటయు బొమలు, కను గుఱి
వదలుటయుం, బైకిఁ జూపఁబడుటయు వ్రేళుల్;
పెదవిఁ గదలింపకుంటయు,
నిది కవనము సేయుచున్న యిమ్మెఱిఁగించున్.

విదూ: అవును. ఈమెయెదుట సగము వ్రాసినయక్షరపంక్తి—
కనఁబడుచున్నది.

రాజు: (చదువుచున్నాఁడు.)

గీ. "అమరుఁ బరువంబు సకలాంగకములయందు" మొదలగు
(విమర్శించి) అహో! గీతపాదము! ఓహో! సూక్తి
యుక్తి! ఔరా! వైదర్భిరీతి! ఆహా! మాధురీధురీణత!
అదిరా! ప్రసాదనిష్ప్రమాదత!

దూ: ఈసుందరి మఱి యించుకతడవభిసరింపంబడుఁగాక!
ఈపున్నమచందురుఁడు నేత్రాంజలిపుటంబులచేఁ బాన
ము చేయఁబడుఁగాక! ఆలాపసాగరము కర్ణరంధ్రముల
వెల్లివిరియుఁ గాక! మన్మథనాట్యాచార్యుండు సంతో
షముతోఁ జేతులెత్తి గంతు లిడుఁగాక!

రాజు: (మఱియొక యడుగు నడచి నలుదెసలు పరికించి)
ఓహో! యెందుఁజూచినను బ్రియురాలే!

క. ఇరుదెఱఁ గయి చిత్తరువునఁ;
బరఁగు నిటన్ విద్ధసాలభంజికయై; సుం

దరిమై యిట నిజముగ, స్మర
పరితాపము నాల్గుపాళ్ళ భరియించుటకో,

కనుక రమ్ము. దాపునఁ జేరి యాలాపరసముచే శ్రోత్రములను గృతార్థములం గావించుకొందము. యుక్తి ప్రజిప్న యఱచేత నున్న నేమి? ఉపాయము చేయకుండ ముత్యములు చేతఁ జిక్కవుగదా! (ఇద్దఱు నిటు నటు నడచుచున్నారు.)

విదూ: (ముందు నడచి భీతిచే వడఁకునొంపినట్లభినయించి) హాశ్ ! హా!హా! తొలఁగు! తొలఁగు! ఇది యేదో పెనుభూతము, కుపితురాలైన దేవిబాహువువలె నేవక్రమయిన యీదండకాష్ఠముతో, దీని నెప్పుడు గట్టిగా మోదెదను. చూడుము నాపౌరుషము.

రాజు: కొదువలేదు. జాజిపువ్వులు చూచి కుంపట్లనుకొను మహాధైర్యశాలివి!

విదూ: అటయిన నిది యేమి?

రాజు: మిత్రుఁడా! మఱేమియు లేదు. స్వచ్ఛభావము గల యీపటికపు రాతిగోడ కవ్వలిప్రక్క నున్నయక్కలికియే యీవలిప్రక్కకుఁ గూడ స్పష్టముగాఁ గనఁబడుచున్న దని తలఁచెదను. రమ్ము. పోయి కేళికైలా

సము వెనుకవైపుననుండి యీమెను సంభావింతము.
(అట్లు చేయుచున్నారు.)

విదూ: ఇంకను ఆమె యెక్కడ? తూనిగలాగున నప్పుడే తుఱ్ఱుమన్నది. ఇదిగో నెగుడుదిగుడయి దేవిగారి భవనమున కభిముఖముగా నడుగుజాడ గనఁబడుచున్నది.

రాజు: హృదయమా! నీకు స్వస్తి యయ్యెడును! ప్రియురాలి ననుసరించి పోవుచున్న నీవు మమ్ములను మఱచిపోఁదగ్గదికాదు సుమీ!

[తెరలో]

జయజయ! త్రిలింగదేశాధీశ్వరా! దేవరవారి కీమధ్యందినసంధ్య సుఖదాయిని యగునుగాక! ఇప్పుడు,

చ. కఱవయి తామరాకు తలఁ
గప్పికొనుం గరి వీనుదొప్పలన్;
బురినడుమన్ శిరంబుఁ దృణ
పుంజరసంబునఁ జేర్చు నెమ్మి; సూ
పరికరము బిసాంకురంపుఁ దమ
కంబునఁ గోఱను నాకు లేకియై;
పొరలఁగఁ గోరుచుండు నెను
బోతును దాఁ దనసీడరొంపిలో.

## విద్ధసాలభంజిక

మ: జలకేలీగతకామినీ జఘన
విస్తారంబుచేతం గళా
కులినీ రంతయుఁ బొంగి యొక్క మొగినిం
గూలంకషంబై వెసన్
దలిరుంబోండ్లగభీరనాభికుహర
ద్వారంబులం బాఱుచున్
సలుపున్ స్ఫారకుహూంకృతంబు మఱియున్
సముద్రత్వముం బొందెడున్.

విదూ: ఓహో! మిత్రుఁడా! దేవిగారి భవనమునకుఁ బోయి మాధ్యాహ్నిక సంధ్యాదికమును నిర్వర్తించుకొందము. పిమ్మట నామె సమాచారముఁ దెలిసికొనఁ బ్రయత్నింతము.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)



## ద్వితీయాంకము.

[తరువాత నొండొరుల కెదురుగా నిద్దఱుచేటికలు ప్రవేశించుచున్నారు]

ప్రథమ: (పరిక్రమించి రెండవదాని చీరకొంగుఁ బట్టుకొని) చెలీ! తరంగికా! నీకడుపులో మహారాజుగారిమాట తేమో యున్నట్లున్నదే! లేనిచో నెదుటఁ దారసిల్లి నప్పుడు నన్నుఁ బలుకరింపక కదలిపోదువా?

ద్వితీయ: (కౌఁగిలించుకొని) సఖీ! కురంగికా! కోపపడకే! పర ధ్యానముచే నిన్నుఁ గానకపోతిని. అసత్యమేని యమ్మ వారి యాగ్రహమునకు నేను పాత్రమయినట్లు.

కురం: ఓసీ! నీకు పరధ్యాన మెందుచేత?

తరం: ఏదో యాలోచించుకొనుచు, నీవు నాకంటఁబడగానే నాహృదయ మెందుచేతనో దడదడఁ గొట్టుకో మొద లు పెట్టినది. అందుచేత.

కురం: ఓసీ! హృదయసదృశురాలి విషయమునఁ గూడ శంకిం
చుచున్నావని నాకుఁ దెలియును. కాని కౌతూహలము
నన్నడిగించుచున్నది.

శరం: ఏమైననుఁగానీ! చెప్పివేసెదను, స్నేహము యుక్తాయుక్త
విచారము చేయదుగదా?

కురం: ఇప్పుడు నామనసెంతో బాగున్నది. కోయిలముద్దు
గుమ్మకుఁ దీయమామిడికొమ్మపయిఁ గూరిమి తగునది
కాదు గదా!

శరం: అవును నిజమే, కాని, రహస్యరక్షణము కార్యసిద్ధికి లక్షణ
మని చెప్పుదురు.

కురం: అట్లనబోకు. తొండ జీవించియుండఁగా దానిశిరస్సువన్నె
మెట్లు లభింపగలదు?

శరం: అటయిన వినుము. కుంతలదేశాధీశ్వరుఁడగు చండ
మహాసేనుఁడనురాజు రాజ్యభ్రష్టుఁడై యిప్పు డిందు
లకు కువలయమాల యను తనతనూజను వెంటబెట్టు
కొని వచ్చియున్నాఁడు. ఒకనాఁ డాసుందరి నర్మదా
నదిలోఁ దానమాడి వచ్చుచుండఁగా, ప్రభువు వా
రామెను జూచి మోహించిరి. ఇది యిట్లుండఁగా, తమ
మేనమామ చంద్రవర్మగారి కొమారుఁడగు మృగాంక
వర్మ కిచ్చి పెండ్లిచేయవలయునన్న తలంపుతో దేవిగా

ద్వితీయాంకము

రాణిమొదల మిగులఁ బ్రీతిగలిగి యున్నది. ఇప్పు డందుకుఁ గావలసిన వివాహోపకరణము లన్నియు సిద్ధము చేయవలసినదని నన్నుఁ బంపినారు. బుద్ధిమంతయు నా వంకనుండుటచే నిన్నుఁ జూడకపోతిని.

కురం: ఓహో! దేవిగారి బుద్ధికుశలత! ఇట్లు చేసినయెడలఁ దనకు సవతిపోరు తొలఁగినట్లును మేనమామ యగు చంద్రవర్మ కుపకారము చేసినట్లును అగు నని!

వసం: మరి నీ వెక్కడకు?

కురం: ఇప్పుడు దేవిగా ఆర్యచారాయణునకు బద్ధపుఁ బెండ్లి యొకటి చేసి యాతని వంచింపఁ దలపెట్టినది. అందుకు గావలసిన వివాహసామగ్రి నాయితము చేయుటకయి నేను బంపఁబడితిని. కనుక రమ్ము. ఎవరిపనివారు నెరవేర్చుకొనుటకై పోదము.

(నిష్క్రమించుచున్నారు)

ఇది ప్రవేశకము.



[తరువాత ఔత్కంఠితుఁడై రాజును, విశేషభూషితుఁడై విదూషకుఁడును ప్రవేశించుచున్నారు.]

రాజు: (మదనావస్థను అభినయించి)

ఉ. పంచశరున్ మరున్ హరుఁడు
భస్మముసేయు విరించి వేగ ని
ర్మించె నటంచు నెంచెద న
మేయశరాఘ్ర్య మజొక్క కాముని\n్
గొంచక పింజపింజ వెను
కొంచును గాడెడివాఁడితూపులన్
ముంచి దళత్కదంబముల
పోలికమై గరుపారఁ జేయుటన్.

(సంతాపము నభినయించి)

మ. అమృతంపున్నడబావి యే కరఁగి
శీతాంశుండు దా నయ్యె నేఁ,
గ్రమతన్ ఫుల్లసితేతరోత్పలములే
కాఁజాలె నేఁ దత్కళం
కము, సర్వాంగములున్ జడంబులుగ ము
న్గంగందునే నందులో,
శమియింపం గలదేమొ యించుక మనో
జన్మాగ్రతాపం బిఁకన్.

మఱియు, సఖుఁడా! చారాయణా!

రాజు: ఆవృద్ధబ్రాహ్మణి నేనా?

విదూ: ఎబ్బె! ఎబ్బె!

రాజు: మఱి యిం కెవ్వ తెను?

విదూ: ఓల్లాగతుఁ డైనమృగాంకవర్మయొక్క పురోహితుని కొమార్తెనండీ!

రాజు: పురోహితుని పేరు?

విదూ: శశశృంగుఁడు. మఱి తల్లిపేరు మృగతృష్ణిక. ఈమె కన్యాతురే అనఁగా నాకుఁ గాఁబోయెడి గృహిణియే అంబరమాల.

రాజు: (తనలో) దేవి కొంచెము పరిహాసముగా నితని నాఁడించఁదలఁచినది కాఁబోలు! నే నిప్పు డేమియుఁ బలుకకుండెదను; పరిహాసలతిక కొనసాఁగనీ!

[తరువాత చేటిక ప్రవేశించుచున్నది.]

చేటి: (ఇటు నటు నడచి యెదుటఁ జూచి) వీరుగో! మహారాజుగారు చారాయణయ్యవారితోఁగూడ వేడుక కై నిర్మింపఁబడిన యీతుషారపుంజము చేరువనే యున్నారు. గనుక దేవిగారిసందేశమును విన్నవించెదను. (చేరఁబోయి) దేవరకు జయమగుఁగాక! "చారాయణునకు మరల నిఁకొకవివాహము చేయఁదలఁచినారము. దేవర పెండ్లివా రయి దయచేయఁగోరుచున్నాను."

అని దేవిగారు మనవి చేయుచున్నారు. అవును. ఈ యనగారి కొక్క తెర్గయే పెండ్లామేమిటి? కనుక దేవర వారు కదళీగృహమునఁ బ్రవేశింపవలయును. పరిజనముతో దేవిగా రందు వేచియుందురు. (ప్రవేశము నభినయించుచున్నది.)

[తరువాత దేవియుఁ బెండ్లికూఁతురు వేషముతోఁ జేటుఁడును విభవానుసారముగాఁ బరివారమును ప్రవేశించుచున్నారు.]

దేవి: చెలీ! మేఖలా! అల్లుఁడుగారిముఖమును జూడుము.

మేఖల: (చూచి శిరసు మూర్కొని) అయ్యా! చారాయణా! ఈయెఱ్ఱతెరఁ దీసివైచి తారామేళకము చేయుము.

విదూ: (అట్లు చేయుచున్నాఁడు.)

దేవి: మేఖలా! త్వరితముగాఁ బెండ్లికూఁతుచే లాజల నిప్పింపుము. జ్వలించుచున్న యీ యగ్నిహోత్రమునందు లాజాంజలులు హోమము చేయవలసి యున్నది.

విదూ: (అట్లు చేసి) ఓ ద్వితీయబ్రాహ్మణి! ధ్రువుని సప్తర్షిమండలమును జూడుము.

చేటుఁడు: (చూచి) ధ్రువుని సప్తర్షిమండలమును జూచినవాఁడనైతిని.

విదూ: ఓసిముద్దరాలా! ధ్రువుని సప్తర్షిమండలమును జూచినదాననైతి ననుము. (చేట విదూషకులు మరల మరల నవ్వేయనుచున్నారు.)

చేటుఁడు: అయ్యా! చారాయణ! నేను బంధులుఁడను దేవి గారి సేవకుఁడను. నన్నుఁ బెండ్లాడెద వేమి? పురుషుఁడు పురుషుని, స్త్రీ స్త్రీనిఁ, బెండ్లాడువైపరీత్యము ద్వీపాంతరములయందును వినలేదు. అంబరమాల అంబరమాలయే!

విదూ: (మేఖలను జూచి) ఆఁ! దోసకారితొత్తా! గయ్యాళి గంపా! వంకనడలబెంకీ! దుందుడుకుచెడుగా! తేసు దారిపలుగా! బూటకాలబుట్టా! నాకుఁ గోడిమెలుకట్టి నన్ను వంచించితివిగాదు? మఱి చూచుకో! కాచుకో!

(అందరు నవ్వుచున్నారు.)

విదూ: (ఇటునటు దిరుగుచున్నాఁడు.)

రాజు: దేవీ! చారాయణుఁడు క్రోధముచే రూపు మారినవాఁడై పొగడతోఁపునఁబడిపోవుచున్నాఁడు. మేమును వెళ్ళవలయును. కర్పూరద్వీపమునుండివచ్చి యొకవిషవైద్యుఁడు తనసిద్ధౌషధప్రభావముచే మాధవీలతామండప మంతయు నెఱ్ఱనిపూలగుత్తులతో విఱ్ఱవీఁగునట్లు చేసినాఁడు. అదృష్టపూర్వ మయినయీఅద్భుత విధానమును జూచుటకును ప్రియవయస్యుని మరలించుటకును మేము పోవుచున్నారము. మఱి నీ వాయద్భుతమును సాయంకాలము చూతువుగాని.

## ద్వితీయాంకము

దేవి: కురంగికా! దేవతాద్వితీయుఁడగు దేవరకుఁ బార్శ్వవర్తినివి కమ్ము. (పరివారముతో నిష్క్రమించుచున్నది.)

కురం: (ఇటు నటు దిరిగి) ఏడుగో! చారాయణయ్యవారు! ఈవిరజాజిపూఁబొదరింటిలో నెమలిపిట్టవలె ముఖము మాత్రము గనఁబడకుండ డాఁగినారు.

రాజు: అటయిన వెళ్లి యాయనను దీసికొనిరమ్ము.

కురం: (ఇంచుకంత సమీపించి) ఏమండోయంబరమాలా ప్రియుఁడుగారు! ప్రభువువారి సెల వైనది (దోవతిచెంగుపట్టి లాగుచున్నది)

విదూ: ఆఁ! చెడుగుతొత్తా! భవిష్యత్కుట్టనీ! నీవుకూడనన్నెగతాళి చేయుచున్నావే? ఇదిగో! చూడు! నీనడకవలెనే వంకరగనున్న యీదండకాష్ఠముతో నిన్నిప్పుడు మోదఁగలను!

రాజు: కురంగికా! పొమ్ము! పొమ్ము! దేవిగారి వెంటఁబొమ్ము! ఆమె పరివారము కంటఁబడఁగానే చారాయణుఁడు మండిపడుచున్నాఁడు.

కురం: (ఇటునటు దిరిగి నిష్క్రమించుచున్నది)

విదూ: ప్రియవయస్యుని వినోదార్థము మహామంత్రిగారుకట్టించిన రత్నవతీయనుచవికె యిది. ఇం దెవ్వతె చెప్పుమా దేవతవలె వెలుఁగొందుచున్నది?

రాజు: (చూచి తనలో) ఓహృదయమా! నీభాగ్యము నేమన వచ్చును? స్వప్నదృష్ట మయినజనమును బ్రత్యక్షముగాఁ జూడఁగలిగితివి! (విదూషకునితో) సఖుఁడా! చారాయణ! నామనోమయూరమును నర్తింపఁజేయుచున్న వర్షాలక్ష్మియ దేసుమీ యిది! ఇంకొక్కమాట చెప్పెదను. ఇది యాపురాణబ్రహ్మ నిర్మాణము కాదు.

ఏమంటేని,

మహాక్కర.

కలువఱేని జడ ప్రకృతిఁగఁ జేసి,
కదళికాండముల నకాండశీత
ములుగ నొనరించి, నీలోత్పలంబుల
ముద్రితవిభ్రమాస్పదములుగఁ
గలుగఁజేసిన ముదివేల్పునలువ
కీ కళ్యాణగాత్రిని నిర్మింపఁగా
నలవియే! కంటిమే! వింటిమే! యెందు
నర్కుండు వెన్నెలల్ గాసెనంచు.

మఱియు నీమె నిప్పుడు రాత్రిందివము లలంకారవిశేషవిరచనము దక్కఁ దక్కొండుతోఁచింపని వయోవస్థ పయికొన్న దని తలంచెదను.

చ. పొరిఁబొరి దిద్దుకొంటయును
ముంగురులం గబరీభరంబుఁ, బ

ల్వారుసకుఁ గప్పఁబూఁతయు, వి
లాసముగాఁ గులికించుటల్ బొమల్
సరసపుఁ జూపుకోపులుఁ, బి
సాళపుఁబల్కులు, నీవిసర్దుటల్
దరుణుల కివ్వి యో ప్రతిప
దంబు నొగింబనివెట్టు వేడుకల్.

విదూ: (ఆకారమును బోల్చి చిఱునగవుతో) రమ్ము. దేవి గారి యెదుటికిఁ బోదము.

రాజు: అక్కఱలేదు. ఇందుండి చూతము.

విదూ: ఏమిది? మూలుగుఁ బోతుపెద్దువలె నీ వడుగడుగునకు నలసిపోవుచున్నావు? తిప్పతీఁగలాగున నీ విక్కడ ప్రాఁకులాడుచుండుము. నేను దేవిగారి యొద్దకేఁగి బోయెదను.

రాజు: నీ వేమి చేసినను జేయఁగలవు. వసంతర్తువు పూఁచిన ధన్ను నేమిమంటే?

విదూ: (నవ్వి యెదుటఁ జూచి) మిత్రమా! పుట మెగసిన బంతిలాగునఁబడుచు లేచుచు నున్నది!

రాజు: (నవ్వి) అవును, చెండాడుచున్నది.

కవిరాజవిరాజితము.

మణిమయనూపుర ఝుల్ఝులశోభిత మంజులచారిపదక్రమమున్
ఝణఝణనాద వినోదలసద్రశ నాగళోదుజ్జ్వల హారమునున్

రాజు: (చూచి తనలో) ఓహృదయమా! నీభాగ్యము నేమన
వచ్చును? స్వప్నదృష్టమయినజనమును బ్రత్యక్షముగాఁ
జూడఁగలిగితివి! (విదూషకునితో) సఖుఁడా! చారా
యణా! నామనోమయూరమును నటింపఁజేయుచున్న
వర్షాలక్ష్మియ దేసుమీ యిది! ఇంకొక్కమాట చెప్పె
దను. ఇది యాపురాణబ్రహ్మ నిర్మాణము కాదు.

ఏమంటేని,

మహాక్కర.

కలువచేని జడ పరిక్రియఁగాఁ జేసి,
కదళీకాండముల నకాండశీత
ములుగ నొనరించి, నీలోత్పలంబుల
ముద్రితవిభ్రమాస్పదములుగఁ
గలుగఁజేసిన ముదినేల్పునలువ
కీ కళ్యాణగాత్రిని నిర్మింపఁగా
నలవియే! కంటిమే! వింటిమే! యెందు
నర్కుఁ డంశువెన్నెలల్ గాసెనంచు.

మఱియు నీవె నిప్పుడు రాత్రిందివము లలంకారవిశే
షవిరచనము దక్కఁ దక్కొండుతోఁచింపని వయోవస్థ
వయికొన్న దని తలంచెదను.

చ. పొరిఁబొరి దిద్దుకొంటయును
ముంగురులం గబరీభరంబుఁ, బ

ల్వారుసకుఁ గప్పుఁబూఁతయు, వి
    లాసముగాఁ గులికించుటల్ బోమల్
సరసపుఁ జూపుకోపులుఁ, బి
    సాళపుఁబల్కులు, నీవిసర్దుటల్
దరుణుల కివ్వి యో ప్రతిప
    దంబు నొగింబనివెట్టు వేడుకల్.

విదూ: (ఆకారమును బోల్చి చిఱునగవుతో) రమ్ము. దేవి గారి యెదుటికిఁ బోదము.

రాజు: అక్కఱలేదు. ఇందుండి చూతము.

విదూ: ఏమిది? మాలుగుఁ బోతుపెద్దువలె నీ వడుగడుగునకు నలసిపోవుచున్నావు? తిప్పతీఁగలాగున నీ విక్కడ ప్రాఁకులాడుచుండుము. నేను దేవిగారి యొద్దకుఁ బోయెదను.

రాజు: నీ వేమి చేసినను జేయఁగలవు. వసంతర్తువు పూఁచిన దన్న నేమియింక?

విదూ: (నవ్వి మొదటఁ జూచి) మిత్రుఁడా! పూత మొగసిన బంతిలాగునఁ బడుచు లేచుచు నున్నది!

రాజు: (నవ్వి) అవును, చెండాడుచున్నది.

కవిరాజవిరాజితము.

మణిమయనూపుర ఝుళ్ఝుళశబ్దిత మంజులచారిపదక్రమమున్
ఝణఝణనాద వినోదలసద్రశ నాగళదుజ్జ్వల హారమునున్

బ్రిణుత తరోచ్చల కంకణఘుల్ఘులరావ విశేషమనోజ్ఞమునై
పరిణయినికందుక కేళి హరించెడుఁ జిత్తి మదీయమనంబునహో!
విదూ: అవునవును.

గీతిక

బిఱబిఱ నిటునటు నడుగిడఁ
బయ్యెద పెనఁగొని జీరాడంగ
గిరగిరఁ దిరిగెడు వేనలి పయి
విచికిలము లిలను రాలంగ
గణగణ గంటల మొలనూల్
మ్రోయఁగఁ గంకణముల్ ఘుళుఘుల్లుమనఁ
బ్రిణుతగాత్రి బంతులాడు నదె
వలరాచకొలువుకూటమున.

రాజు: సీ. చెమటచిత్తడిచేతఁ జిత్రకంబు గరంగి
వదనచంద్రునికాంతి వ్యక్తపఱుప
వరుసవెంబడిఁ గరపరిహణనంబులు
పైకి లెక్కింపఁబడుచుండఁ గ్రుక్కగొనక
తఘుకునిద్దపుఁ జూపు తత్పతనోత్ప
తనముల ననుసరించి దుముకులాడఁ
గాలియందెలుఁ జేతికంకణంబులు
ఘుల్లుఘుల్లు మంచును దాళకలన నెఱపఁ
జెలఁగి చెండాడు చున్న యీకలువకంటి
కరతలాఘాత లాలిత్యసరణివలన

సారెకును గోర్కె లువ్విళు లూరి మదికి
నతిశయానందపారవశ్యము ఘటిల్లె.

(మరలఁ పరికించి) ఆహాహా! యేమి తాండవవేగము!

గీ. వలిపె పావడకుచ్చెళ్లు వలదు దార
హారవల్లులు మేఘధిక్కారి వేణి
బంధమును జుల్కమండలభ్రమణములను
దిరిగెడును మూడుగోడుగులు తిరుగుకరణి.

(మరల నిరూపించి)

మ. స్మరతూణీరనికాశమా శ్రవణపా
శం బందహా! లోచన
స్ఫురదిందీవరనాళమున్ వలయితం
బుం జేసెనోనా, మనో
హరముం దాల్చెఁ గృశాంగి కుంకుమరస
న్యాసాతిగౌరంబుఁ గే
లిరయోద్రేకముహుర్ముహుర్గళిత తా
ళీపత్రతాటంకమున్.

విదూ: ఇప్పుడు కందుకకేళి చాలించినది.

రాజు: చాలించి యూరకుండలేదు. చేతఁ జెయి చేర్చుకొని
యెఱిఁగినట్లు మనవంకకఁ జూచుచున్నది. చూడు,

చ. నెలఁత నిజాననద్యుతి వి
నిర్జిత జర్జరితేందుబింబ పం
కిల మగుచెండు కేలఁ గొని,
కేళితమిన్ వెనుకొంచుఁ గోరికల్
మొలవఁగఁ గావిమోమున, న
ఖుల్ తుదలం గదలించు కేతకీ
దళములఁ బోలు దీర్ఘనయ
దంచదపాంగములం గనున్ ననున్.

విదూ: రమ్ము సుందరి ననుసరింతము. ప్రేమతటాకము న
గండిపడుఁగాక! కన్నుల కమృతగండూషము కలుగు
గాక! మదనునకుఁ జేయూఁత యీయఁబడు గాక!
పంచమఝుంకారముల యధికారమంతటను జెల్లుఁగాక!
పరిచారికాజనము విరహవేదనాభాజన మగునుగాక!
మన్మథసంధివిగ్రహ మతిశయించునుగాక! ఎడతెగ
చింతచే చారాయణ బ్రాహ్మణుఁడు కంఠగతప్రాణు
డగునుగాక!

(ఇటునటు నడచి మెట్లు దిగుట నభినయించుచున్నాడు)

విదూ: దేవుఁడు లేని దేవాలయమువలెను, అక్షరములేనియుత్త
రమువలెను, ఆమె యెక్కడను గనఁబడుట లేదెండ
చేత?

రాజు: గంధర్వనగరివలెఁ గనఁబడుటయుఁ గలదు; కనఁబడక పోవుటయుఁ గలదు.

విదూ: రమ్ము. నిపుణముగాఁ బరికింతము. ఎక్కడనో యేస్తంభముచాటుననో దాఁగియుండును. (నలుదిక్కులు కలయఁజూచుచున్నాఁడు.)

రాజు: (విషాదముతో నేలమీఁదఁ జూచి)

చ. అడుగుల లత్తుకల్ గలయ
నంటిన యీమణికుట్టిమస్థలం
బెడపక తెల్పెడున్ సుదతి
యిచ్చోఁ గందుకకేళి సల్పుటన్
బడఁతుక గానరా దహహా!
పాటిలె సద్భుత మేదొ! హా! స్ఫురిం
చెడుఁ బరికింప; దీనిని సృ
జించె మరుం డొక మోహమాయగా!

(సంతాపము నభినయించి యొంతటను జూచి)

చ. చెలువుగఁ గ్రుచ్చి వేనలినిఁ
జెర్చినపూసరు లిందుఁ జిందెఁ, గెం
పులజడబిల్ల డుల్లె నిట
భూసతికిం దిలకంబుఁ గూర్చెడున్,

గలయఁగ రాలె నిందుఁ దెగి
　　కన్నియహారమునుండి ముత్యముల్,
దలఁగుచుఁ గర్ణపాశమును
　　దానిదె దుద్దొకఁ డిందుఁ దోఁచెడున్.

విదూ: మేలు! ఇదిగో నిక్కడ నుంపవలయు నని యుంచి నట్టుగా తాలవృంత మొకటి యున్నది. (పుచ్చుకొని విప్పి) ఎట్లూ? అక్షరములా! ఓహో! ప్రియవయస్య! అక్షరమును దీయఁగలుగుదువేని యిది యేమో చదువుము.

రాజు: (చదువుచున్నాఁడు.)

గీ. "అమరుఁ బరువంబు సకలాంగకములయందు
గన్నఁగవ కొక్కవింత ప్రాగల్భ్యమందు"

(చూచి) రెండుచరణములే. ఇప్పుడును నాలుగు చరణములు లేవు.

విదూ: పార్శ్వవాతరోగులవలె నెంతసేపని నిలువుఁగాళ్ల మీఁద నిలుచుండఁ గలము? కనుక రమ్ము; మత్తవారణింబ వేశింతము. (అట్లుచేయుచున్నారు.)

[తెరలో]

శా. కట్టా! వెల్వెలఁబారె నెమ్మొగము, డి
　　గ్గన్ జారె నేత్రప్రభల్
నిట్టూర్పుల్ మితిమీఱె బిట్టదరఁ గే
　　లీ పద్మపత్రాగ్రముల్

ద్వితీయాంకము

మ్మిఁక నీమనోగతుఁ డెవం
తెల్పవేనిం జెలీ!
హాపాంసుఖేలనసఖ

క్షి ప్రసంగంబులన్.
ంచి) జడవేయవయ్యా! ఏదో అమానుష
సఁబడుచున్నది.
వ నెవ్వరో మాటలాడుచున్నారు.
కుఁ జెప్పుము.
చి సిగ్గుచేఁ జెప్ప కూరకున్న యొకకన్ని
దహస్యమును దానిచెలికత్తె చెప్పించుకొను.

రలో వాక్త్రసంభమతో]
యిందు మర్మ మేమున్నది?
ంటివా?

లిసినది. ఏమున్నది? పండితులు శూన్య
పెట్టుకొని, ఫలముసంగతి మఱచిపోయిన
మూలమును విడిచి పయిపయిని ఆకల
మల్లాడుచుందురు. ఇంక మూర్ఖులో, పన
లవలె మూలమును విడిచిపెట్టక ఫల
ంతురు. తెలిసినదా? తెలియకపోయినఁ

తెలిఁగించి చెప్పెదను. నేఁ జెప్పుచున్నమాట లెవరినిఁ గూర్చియో కాదు. నిన్నుఁగూర్చియే! చంద్రదర్శనము లేకుండ చంద్రకాంతపుబొమ్మ జాలువాఱునటయ్యా?

రాజు: అవును. కారణము లేకుండ నీ విట్లు పలుకవు. పద్మరాగమునకు ఆకరము లేకుండునా?

[తిరిగి తెరలో]

ద్విపదలు.

చెలువరో! క్రొత్తగాఁ జటిలింపఁబడిన
చెలువంపుముత్తెంపుఁ జిప్పలనుండి
రాలుమ్ము తమ్ము లట్టుల గాల్చు శువుల
వాలుఁగన్నులనుండి వలదు రాల్పంగఁ
గాటుక నీటెల్లఁ గరఁగి పాఱంగఁ;
బాటలాధరి! నీదు వరతనూకదళి
రససిక్త మీక ఛచ్ఛాయ లెసఁగి
వసివాడ వెల్వెలఁబాఱె నేమిటికి?
కెంగేలి కేలిపంకేరుహాగ్రములు
బంగారుబొమ్మ! కంపంబు నొందంగ
వెడలించె దేటికే వేఁడినిట్టూర్పు
ఉడరించి నీహార యష్టిపొడవున?
పోఁక ముడియు జైకముడియు జాఱంగఁ
బాకంబు దప్పి దుర్బల వైతి వేమొ?

ద్వితీయాంకము

రమణీ! యంగము దినరాజమండలము
క్రమమునఁ బరిపాండురం బయ్యె నేమొ?
చెప్పకుండెదు గాక చెలి! యివి యెల్లఁ
దప్పక యల్ల విద్యాధర మల్ల
సందర్శనంబున సంభవించినవి;
యెందైన వికసించునే మఱి నల్ల
వావిలిపూవులు వనజాకరమునఁ?
యీ వెఱుంగవుగాక యెఱుంగమే మేము?

విదూ: కలలోఁ గానఁబడినదియు, నుయ్యేల యెక్కి యూఁగినదియు, విద్ధసంచారితసాలభంజికారూపమున వెలసినదియు, కందుకకేళిసల్పినదియు, కావ్యబంధమును గల్పించినదియు, నిమ్ముదితయే సుమీ! ఈమెను జూచుచుండుటచేతనే నీహృదయము బొత్తుగాఁ జెదరిపోవుచున్నది.

[తెరలో]

కాఁబట్టి చెలీ! మృగాంకావళీ; నే నిప్పుడు నిస్పృష్టార్థ దూతీతంత్రము నడపెదను.

రాజు: అదియే యిది. ఇప్పుడు మన్మథుఁడు మృగాంకావళి యనుపంచాక్షరిని నామనసునం దెక్కించుచున్నాఁడు.

[మరలఁ దెరలో]

సీయవస్థను నివేదించుటకయి మహారాజుగారిసమక్షమునఁ జదువఁదగిన రెండుపద్యములుకూడ రచియించినాను. ప్రియసఖి వినఁ గోరెదను.

ఉ. "చందనకర్దమోల్లిఖితుఁ
జంద్రునిఁ బ్రామెదుఁ బండ్లు గీఁటుచుం
గందుని కివ్వితూపు లని
కట్టలుకన్ విరులెల్ల ద్రుంచెదున్
వందనయోగ్యు మన్మథునిఁ
బట్టుకతిట్టెదు నెత్తిపొడ్చుచున్
సుందరి వెఱ్ఱిగొన్నదయి
శోభనమూర్తినిఁ గాంచి నిన్నొగిన్."

మఱియు

సీ. "తెక తెక నుడుకునంగకముల వేఁడిచేఁ
గాఁగులతో నీరు గాఁచవచ్చుఁ,
గంటికి నేలకొక్కటె ధారగాఁ బాఱు
కన్నీటఁగాలువల్ గట్టవచ్చు,
నిబిడమై ప్రసరించు నిట్టూర్పుచే
దీపవర్తిలతికల నార్పంగవచ్చుఁ
బాండిమం బన నొప్పుపాలవెల్లి మునింగి
యంగలక్ష్మిని వెదకంగవచ్చు

నేమి చెప్పెదు దేవ! యిం కీవు వచ్చు
తోవ వాతాయనమునందుఁ దొంగి తొంగి
చూచుచుండును రేయెల్ల సుదతి వినుము
చంద్రకిరణమ్ములకుఁ జేయి చాటు చేసి."

విదూ: నాకుఁ జూడఁగా నెవ్వరో బ్రహ్మరాక్షసులు ఈ బంగరుచవికెలోఁ బ్రవేశించి మనలను బట్టుకొని వంచించుటకయి యిట్లు పిలుచున్నారని తోఁచుచున్నది. ఇదిగాక సంధ్యాసమయము భూతములకుఁ బ్రీతికరము; కనుక దిగుదము.

రాజు: సరే లెమ్ము. (దిగుట నభినయించుచున్నారు.)

[తెరలో]

దేవరవారి కీసాయంతనసంధ్య సుఖదాయిని యగునుగాక!

ఇప్పుడు,

మ. దినజీవుండు గతింప నెంజిలి విర
క్తిం జెంది సూర్యుండు వే
చని నస్త్రాద్రికిఁ జాల్చి కోష్ణకరకా
షాయాంబరంబుల్, మఱిన్
మొనగుంజీకటి నించుకంత నలుపుం
జేకొంచు లోకంబు పో

# విద్ధసాలభంజిక

ల్చు నిదే ధూమ్రపురాణచిత్రపటసం
శోభాస్పదంబై ప్రభూ!

కృతి ... నిది

సీ. సైరంధ్రి లతివలఁ జక్కఁగ సేయుచోఁ
గంకణంబులు బోరు కలఁగువేళ
నేప్పమైఁ బాత్తోడఁ గూర్పంగ దూతికల్
సంధివిగ్రహవిధుల్ జరపువేళ,
బోగంపుటిగురాకుఁ బోండ్లు పోఁడిమిమీఱ
మల్లెపూబాన్పు లమర్చువేళ
నిదుర మేల్కని వెండి మదనుండు
సమరసన్నాహంబుఁ బూని యొనర్చువేళ,

గీ. విమలసౌధాగ్రమణికుట్టిమములపయినిఁ
జల్లనిపటీర సలిలంబుఁ జల్లువేళ,
కోమరుఁబ్రాయంపు దంపతుల్ కోర్కెలూర
మించి యభిలాషముల సంభ్రమించువేళ.

రాజు: సంధ్యోపాసనముఁ జేసికొనుటకు దేవిభవనమునకుఁ
బోవుదము.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

# తృతీయాంకము

●

[తరువాత చేటి ప్రవేశించుచున్నది]

చేటి: (ఇటునటునడచి) ప్రియసఖి విచక్షణను జూచి నే నెన్నాళ్ళో యైనది. దాని నెప్పుడు చూతునాయని యెక్కుడు తహతహచే నాహృదయ మెండ(బెట్టిన యేను(గుదంతమువలె( బగిలి పిగుల నున్నది. నా కిప్పుడది యెక్కడ( గాన(బడును? (ఎదుట(జూచి) ఏమీ! ఇదిగో ప్రియసఖి యేమో యాలోచించుకొనుచు నీ వంకనే వచ్చుచున్నది.

[తరువాత నట్టివైఖరిగల రెండవచేటి ప్రవేశించుచున్నది.]

చేటి: ఓహో! మహామంత్రిగారి స్వామికార్యభక్తి సాటిలేనిదిగా నున్నది.

ప్రథమ: ఏమీ! మహాభాగ్యసంపన్నుల కార్యసిద్ధివలెనే ప్రియసఖి తలంచినంతనే తారసిల్లినది! కనుక వెనుకపాటున వెళ్ళి కన్నులు మూసెదను.

(అట్లు చేయుచున్నది.)

ద్వితీయ: ప్రియసఖియైన సులక్షణ చేతులతో నంటినట్లున్నది. (ప్రకాశముగా) చెలీ! సులక్షణా? తెలిసికొన్నానే! కన్నులు వదలు!

సుల: (కన్నులువదలి చనువుతోఁగూడిన కోపముతో) త్రడిసి బిఱ్ఱబిగిసిన జనపనార త్రాటి ముడివలె మన స్నేహమెంతో గాఢమైనదిగదా! దానినైనను విచారింపక తోఁకదీసిన పిచ్చుకవలెఁ గనఁబడకుండఁ బోతివి. నాకు నీమీఁద గోపము రాకుండునఁటే?

విచక్షణ: (బతిమాలుచు) చెలీ! సులక్షణా! కోపపడకే! ఈ తప్పు మహామంత్రి భాగురాయణుని నియోగము చేసినది కాని నేను జేసినదికాదే!

సుల: (చిరునగవుతో) మంత్రాంగశక్తియందు మాఱులేని దానవు.

విచ: ఇవియన్నియు అబలలు సేయఁదగిన యాఁడుమంత్రాంగములుగదా?

సుల: ఆఁడుమంత్రాంగము లగుటచేతనే ఆఁడువాం డ్రిగపడక పోవుట! అందుచేతనే మముబోంట్లను కన్నుల కడనెప్పుడు కాలితోఁ దన్నుకొనిపోవుట!

విచ: అయితే నీవు సేయుచున్న మంత్రాంగమేమో కొంచము చెప్పుము!

మల: నీవు చెప్పినవిమ్మాట నేను జెప్పెదను. ముందు మావిమంజరులను మేసినదా కలకంఠి, తన కంఠమ్ముధను సవరించుకొనుచున్నది?

విచ: అట్లయిన వినుము. ఒకప్పుడు షాడ్గుణ్యాసంపన్నుఁ డైన భాగురాయణుఁడు నన్ను గౌరవముతోఁ జేరఁజీరి "విచక్షణా! నీవు నా కొక్క రాచకార్యమునందుఁ దోడుపడవలయును" అని సెలవిచ్చెను.

మల: ఏమే నీబుద్ధివిభవము! మహామంత్రిగారు సయితము నీవల్ల నొక మహత్కార్యము సాధింపఁ బడఁగలదని తలఁచుచున్నారు! వకుళావళి వాసనలు వలపు గొలుపునని చెప్పవలయునా? తరువాత, తరువాత,

విచ: తరువాత నేను మిగుల వినయముతోఁ జిత్తమంటిని. అప్పుడాయన "మృగాంకవర్మ మృగాంకావళి" యని సెలవిచ్చిరి.

మల: తరువాత, తరువాత,

విచ: తరువాత "ఆవన్నెలాడిం బెండ్లియాడి మహారాజశ్రీ విద్యాధరమల్లదేవుఁడు మహీతల చక్రవర్తియగును గనుక, నీవెప్పుడో యొక్కనాఁ డప్పుఁబోడిం దోడుకొనివచ్చి గోడలోని సందుత్రోవలగుండఁ బడకింటం బ్రవేశపెట్టి, యందు మహారాజుగా రామెనుజూచి

స్వప్నమని భ్రమనొందునట్లు సేయవలయును. ఆపిమ్మట నెప్పు డెప్పుడేమేమి చేయవలయునో యదియెల్ల నీకు హరదాసుఁడు తెలుపుచుండును" అనికూడ సెల విచ్చిరి. నీవుకూడ నాయిందుముఖికిఁ బ్రియసఖివే కనుక ఈమహారాజకార్యరహస్యమునందుఁ దోడు చూపవలయునని వేఁడుచున్నాను. మెట్లెక్కకుండ మేడ యెక్కలేముగదా? తరువాత నేను హరదాసుఁడు చెప్పిన కార్యపద్ధతి ననుసరించి మృగాంకావళితో నమ్మకముపుట్ట నిట్లంటిని. "చెలీ! మృగాంకావళీ! యీ వాసభవనమునఁ బూవిలుతుఁడు వెలసియున్నాఁడు. నీవాతని దర్శించి నీమెడలోని హారమును గానుకిచ్చి పూజింపుము. పూజింతువేని నీకట్టికాంతుఁడు లభింపఁ గలఁడు" అని ఆమెయు నట్లుచేసెను. నేనును అంతటితో నూరకుండలేదు. ఉయ్యేలయెక్కి యూఁగుచున్న యక్కలికిమిన్నను వెండియుం జూపించితిని. కేళీకైలాసములోని పటికపు జాతిగోడలపయి నాపెరూపు నాపె చేతనే స్ఫుటముగా వ్రాయించితిని. సారంగముల గుండఁ గంబమునం బ్రవేశపెట్టి యామెచే రాజుగారు వినునట్లుగాఁ బలుకులు పలికించితిని; పదములు పాడించితిని.

౨ల: ఆచిన్నదాని చిన్నెలు వన్నెలు చిత్తగించినారుగదా. ఇప్పుడు మహారాజుగారేతీరుగా నున్నారు?

౧చ: కేళికరిణితోడి నయ్యాటలకుఁ బాలుపడి బేలుపడు వడవి యేనుఁగు చందమున నున్నవారు. మఱియు లేఁబోఁక పొత్తుల ధిక్కరించు చక్కని ద్రావిడాంగనల పలు వరుసలట్లు తెలివిమీఱు తేటవెన్నెలకు దడ్దఱిలి తబ్బిబ్బుగఁ బలుకుచున్నవారు. అది యెట్లంటేని,

"మ. సనెకంటం బొడిసేయుఁ డీ క్షణములోఁ
జంద్రున్; మహీకూర్చికల్
గొని రేబోటిమొగానఁ జిక్కఁగ మసిం
గొట్టుండి నల్వెక్కఁ; బే
ర్చిన కిన్కన్ హరియింపుఁడీ కుముదల
క్ష్మిన్ మంత్రతంత్రంబులన్
గననోర్తున్ లలనాముఖాంకితసుధి
గ్భాగంబు లల్లైన-చో!"

౨ల: ఇంక నామెయవస్థ యెట్లున్నది?

౧చ: "ఉ. ఆడదు పూవుఁదోటఁ, గొని
యాడదు వెన్నెలతేట, బోటులం
గూడదు, కేళిమండపము
గుమ్మమువంకను దొంగిచూడదున్

వేఁడదు వేషపోషణము,
వీడదు కెంజిగురాకుపాన్పుఁ, బూఁ
బోఁడి తదీయ నవ్యమృదు
మోహన రూపవిభావనారతిన్."

మఱియిప్పుడు నీవు చేయుచున్న మంత్రాంగమేమో చెప్పఁగోరెదను.

సుల: విను చెప్పెదను. ఒకప్పుడు మహారాజుగారు నాయందలి యనుగ్రహముచే నాచెవిలో "నీకొక్క రహస్యము చెప్పెదనుగాని దేవిగారికి మాత్రము తెలియనీయఁగూడదు" అని యానతిచ్చిరి.

విచ: అది యెట్టిది?

సుల: ఎట్టిదా? "అబద్ధపుఁ బెండ్లిచే సటమటనొంది యుపేక్షింపఁబడిన చారాయణుఁడు దేవిగారి దాదికూఁతును బెలుపుచ్చఁ గోరుచున్నవాఁడు. కావున నీవు పొద్దు గ్రుంకినవెనుక దట్టమ్ముగఁ గ్రమ్ము సందెచీకఁటిలోఁ బొగడమ్రానిపై నెక్కి, యుద్యానవీథి నొంటిగఁబోవు మేఖలనుగూర్చి ముక్కుమాటలుగా ఓసీ! మేఖలా! నీవీవైశాఖపూర్ణిమనాఁడే ప్రదోషవేళను మరణము నొందెదవు, అని యాడు" మనిరి. నేనును దానితో నట్లే యాడితిని.

విచ: తరువాత, తరువాత.

సుల: తరువాత నప్పడఁతుక భయముచే నొడలు వడవడ వడంకఁ జెదరిన హృదయము నెట్టకేలకుఁ బదిలపఱచుకొని, చెట్టువంకఁ దిరిగి చేతులుమోడ్చి, "భగవతీ! అశరీరవాణీ! నీవు నాయందలి కరుణచే నాకుఁ గలుగఁబోవు మరణము నెఱిఁగించితివికదా! తల్లీ! యింక నే నెట్లుబ్రదుకఁగలనో యదినయితము నెఱిఁగింపుము." అని వేఁడుకొనెను.

విచ: తరువాత, తరువాత.

సుల: తరువాత దానితో నిట్లంటిని. "గాంధర్వవేదవిచక్షణుఁడగుబ్రాహ్మణుని నొకని సమధికసత్కారములచే సంప్రీతుఁ జేసి యాతని యడుగులవ్రాలి కాళ్ళసందున నిటుకి చరించుచువేని నీవు బ్రతుకఁగలవు"అని.

విచ: ఓసీ! యేమే నీనేర్పు. మునులుగూడ బ్రాహ్మణునిపాదములవలనఁ బవిత్రత్వమబ్బుచున్నదని చెప్పుచున్నారు.

సుల: (ఆలోచించి) ఇది యంతయు ఆబ్రాహ్మణుని కపటనాటక కపనమే!

విచ: తరువాత, తరువాత.

సుల: తరువాత నామాటలు విన్నదయై కాటుకనీటును గడిగివేయుచున్న కన్నీటిధారలను మాటిమాటికిఁ దుడిచి

వైచికొనుచు మేఖల తిన్నగా మహారాజుగారి చేరువ నున్న దేవిగారి యొద్దకువచ్చి యామెతో నేను విను చుండఁగా నడచిన సర్వవృత్తాంతమును నివేదించెను. అప్పుడు దేవిగారినిఁ గలఁక దేర్చుటకును, చారాయణుని కోరిక నెరవేర్చుటకును వచ్చియుండిన ప్రభువువారు "సుందరీ! దిగులొందవలదు. ఏమందువేని, గాంధర్వ వేద విచక్షణుఁడగు బ్రాహ్మణుఁడు మనకు స్వాధీనుఁడుగానే యున్నవాఁడు. కనుక నధరబింబము నశ్రు జలముచే నెందుకు తడిపెదవు." అని దేవిగారిని కుదురు కొల్పిరి. ఆపున్నమ నేఁడేయని దేవిగారితో నేనుఁ జెప్పఁగా పూజాసంభారము సిద్ధము చేయవలసినదని నన్నుఁ బంపినారు.

విచ: సరే! రమ్ము; వారి సెలవుప్రకారము నడచుకొందము.

(ఇద్దఱు నిష్క్రమించుచున్నారు)

ఇది ప్రవేశకము.

తృతీయాంకము

[తరువాత గాఢోత్కంఠితుఁడై రాజును, స్నానశుచియై విదూషకుఁడును ప్రవేశించుచున్నారు.]

రాజు: (అనుధ్యానము నభినయించి)

గీ. పొడుచుకొని గుబ్బచనుదోయి పొటమరింప
ముడిఁగి వళిరేఖలన్నియు నడఁగిమడఁగ
బోటికై దండ గొంచును బొట్టవ్రేళ్ళ
నిలిచి యత్తెత్తి ననుఁజూచు నెలఁతఁదలఁతు.

విదూ: ఉండవయ్యా! నన్నిప్పుడు మాట్లాడించకు. దేవిగారి సన్నిధానమందు మేఖలను బ్రతికించవలెను. (తనలో) ఆఁ! దుష్టదాసి! దుష్ప్రబుద్ధుఁడైన చారాయణ బ్రాహ్మణుఁ డిప్పుడే మీఁదఁబడఁగలఁడు.

రాజు: (వినిపించుకొనక పయిపద్యమునే చదువుచున్నాఁడు.)

విదూ: అదేపనిగా నామెను దలఁచుకోకు. అగినిమంట లెగయించు నాఁడుపిశాచ మది.

రాజు: ఏమంటివి? అగినిమంట లెగయించునా? అటయిన నీచెవులకు కోకిలకాకలీకలగీతికలు చీఁదఱ గొలుప వలయును. నీకన్నుల కమృతవర్షముఁ గురిసెడి చంద్రబింబము కాఁకచేయ వలయును. నీమొడలికి మంచి గందపుఁబూఁత మంటలెత్తింపవలయును.

విదూ: ఔనులే. నేను కేరడము లాడినాను. నీవు నీరమునుండి క్షీరమును వేఱుపఱచు హంసవలెనే సర్వవస్తువుల యొక్కయు సారమును గ్రహించినాఁడవు. ఏమి చెప్పుదును? అలసుఁడు విద్యనువలెనే అయ్యగారమ్మగారిని మఱచినారు.

రాజు: ఎంతమాట! ఆబాల్యప్రవర్ధిత ప్రియాధ్రపేమ యగు దేవిని మఱతునా? మఱేమన్న,

క. నెలఁతలతలఁ గడకాలిడి
వలపులకాణాచి భుక్తపఱచుకొనియె దే
వి; లతాంతశరుని పనుపునఁ
జెలియుం బంచుకొననదియె చెఱిసగమయ్యెన్.

విదూ: అందుచేతనేకాఁబోలు నీహృదయముయ్యేలవలె ముందుకు వెనుకకు నూఁగులాడుచున్నది.

రాజు: వయస్యా! నీవు చెప్పినమాటి యథార్థము. ఏమందు వేని

గీ. అభినవానురాగ మపరాధ మోర్వదు
చనదు నలిపిపైవ జాజిసరము:
దేవితోడి చెలిమిఁ ద్రెంపఁ గూడదు, వాడి
సనుచు వకుళమాలఁ జనదువిడువ.

విదూ: అబ్బో! యెందుకు వచ్చిన యిచ్చకాలివి? పంచబాణుకును బడగెంటకుండఁ దలిరుటాకు తలయెత్తదు. ఇంతేగాక క్రొత్తగనుపులఁ బొటమరించి నిగనిగలాడు చిగురుమోటికల మేయ మరగి పోతరించు లేడిపోతు దవనపు మడియందుఁ దవిలి క్రీడింపదు.

రాజు: మిత్రుఁడా! నీనోటి కడ్డులేదు. చేయరాని శంకలు చేయుచున్నాఁడవు.

విదూ: ఈగొడవ నాకేల? ఇదిగో చెప్పుచున్నాను విను. నన్నిప్పుడేమియు మాటాడించవద్దు. దేవిగారి సమక్షమున మేఖలను బ్రదికింపవలెను.

[తరువాత దేవియు, సన్నద్ధశాలయి మేఖలయు, విభవానుసారముగాఁ బరివారమును ప్రవేశించుచున్నారు.]

దేవి: చెలీ!సులక్షణా! అంతఃపురము ముందటివసారలో నార్యపుత్రుఁడును చారాయణబ్రాహ్మణుఁడును ఉన్నారే?

సుల: దేవితో నేను మఱియొకవిధముగా మనవిచేయుదునా?

విదూ: వయస్యా! యీవసారాలోఁ గూర్చుందము (అట్లు చేయుచున్నారు.)

దేవి: (చేరవచ్చి) జయము! ఆర్యపుత్త్రునికి జయము! అయ్యా! చారాయణ! మేఖలను బ్రదికించి నాకు ధాత్రేయికా భిక్షము పెట్టుము.

విదూ: ఇదిగో సిద్ధముగా నున్నాను.

మేఖల: (దోసిలియొగ్గి) అయ్యా! చారాయణ! ఈదాసురాలు మహాబ్రాహ్మణుఁడవైన నిన్ను శరణుచొచ్చుచున్నది. (అంతని యడుగులపయి శిరస్సుఁ జేర్చుచున్నది.)

[తెరలో]

ఏదీ యాచెడుగుదాసి? ఏదీ యెందున్నది? మేము కాల పురుషులము. మెదలకుండ మెడకు సంకెళ్ళు వేసి మేఖలను గట్టి యీడ్చుకొనిపోవవచ్చినారము.

విదూ: (పలుతెఁగులఁ బాడుచు దండకాష్ఠము నెత్తిపట్టుకొని) పింగళికావల్లభుఁడను, గాంధర్వవేదవిచక్షణుఁడను. నేను రక్షకుఁడనై నిలిచియుండఁగా కాలుఁ డనఁగా నెనఁడు? కాలపురుషులనఁగా నెవ్వరు? కాలశృంఖల యనఁగా నెట్టిది? (బహువిధముగా చిందులు త్రొక్కు-చున్నాఁడు)

మేఖ: (కాళ్ళలో దూరి) రక్షింపుము, రక్షింపుము.

విదూ: (గట్టిగాఁ బాడుచు, పెడమొగముగా) చూడు మహా రాజా! చూడు. విలాసినీ మన్మథరథాధిరూఢుఁడైన నీ ప్రియవయస్యునిఁ జూడు.(కొంచెము గట్టిగా)చూచితిరా నాబ్రాహ్మణత్వముయొక్క మహిమ? కాలపురుషులు

గొలుసులు గలగలలాడ గోచులూడఁ బికాపికలయి
నారు.

మేఖ: అమ్మయ్యా! బ్రతికినాను.

విదూ: (చఱచుకొనుచు నవ్వి) ఆఁ! తొత్తుకూఁతురా! ఆబ
ద్ధపుఁ బెండ్లిచేసి యాడించినందుకు ఆగ్రహాగ్రస్తుఁడయి
చారాయణబ్రాహ్మణుఁడు నీకు శాస్తి చేసినాఁడు.
కాని యీకారణముచే మాయింటియాబిడ పసుపు
బొట్టునకుమాత్రము భంగము రాదనితలఁచుచున్నాను.

మేఖ: (సిగ్గునొంది యేడ్చుచున్నది.)

దేవి: ఆర్యపుత్రా! నాప్రియసఖియైన మేఖల నీప్రకారముగా
నుడికించుట తగినదిగాను సరిపోయినదిగాను ఉన్నది
గదా?

విదూ: మహారాజుగారి ప్రియవయస్యు నాప్రకారముగా నుడి
కించుట దేవిగారికిఁ దగినదేమి? సరిపోయినదేమి?

దేవి: భర్తగారి బంధువుగదాయని యిది నీతోఁ గొంచెము
పరియాచకము చేసినది.

విదూ: దేవిగారి చుట్టముగదాయని దీనితో నేనును గొంచెము
కోడిగ మాటాడినాను.

మేఖ: దేవీ యితఁడు సమాధానము చెప్పనుగలఁడు, శాస్తి
చేయనుగలఁడు. మహారాజుగా రెట్లాడించిన నట్లాడు

చున్నాఁడు. మొగలిపువ్వువాసన తగులుటఁబట్టికాని, చంద్రుఁడు ముద్దునకు సౌరభము కూడనా?

(దేవి కోపము సభినయించుచుఁ బరివారముతో నిష్క్రమించుచున్నది.)

విదూ: వయస్యా! యిప్పు డీగనైనను లేకుండఁ జేసినాను.

రాజు: దేవి మిక్కిలి చిన్నఁబుచ్చుకొని యేడ్చుచు వెడలిపోయినది.

విదూ: ఏడువనీ! ఏడువనీ! యేడ్చినంతమాత్రమున ముత్యాలేమియు రాలిపోవులే. రమ్ము. ఎదుటియుద్యానమునకుఁ బోదము. (ఇటునటు నడచుచున్నారు.)

విదూ: ఇదిగో నాచేయిపట్టుకొని యడుగులు మెల్లగా నిడుచు నడువుము. ఏమంటేని లెక్కకుమీఱిన తుమ్మెద బారులచేఁ గూర్పఁబడినట్లును, కోయిలమూఁకలవలన గలిగింపబడినట్లును, చమురువయిచి మెదిచినపదను కాటుకముద్దలవలనఁ బుట్టింపబడినట్లును, ఇంద్రనీలమాణిక్యముల పొడులవలనఁ బొడమింపం బడినట్లును, గరళకంఠునికంఠకాంతులచే ఘటియింపఁ బడినట్లును, నీలవర్ణుని నెమ్మేనినుండి నిర్గమించినట్లును, విధుకళంకమువలన వెడలింపఁ బడినట్లును, నీలోత్పలదళములచేఁ నిర్మింపఁబడినట్లును, కరిమదధారలచేఁ గల్పింపఁబడి

నట్లును, గ్రమ్మిచిమ్మచీకఁటి మిత్తిదిగొత్తిది, దూరమిది చేరువిది నలుపిది, తెలుపిది, కొంచెమిదిగొప్పయిది, యని యేర్పరింపఁగ నీక లోకమును జీకాకుపఱచుచున్నది.

రాజు: అవును నిజమే.

గీ. పిడికిలింపఁదగిన చెంజీఁకటిని దిక్కు-
లాడలినోరసినట్టు లుండు; మఱియుఁ
గాలినడక కిముడు కరణి భూవలయంబు
దగును; నోసలి బంటి యగును నభము.

ఇప్పుడు కొంచెమూహచేసెదను.

సీ. చెవిసంది నెమిలిపించెముఁ జెర్వి
సందిళ్ళఁ బచ్చలకడియముల్ పరిఢవించి
యుదుటుగుబ్బలపైనిఁ ద్రిదశేంద్ర
మణిసాంద్ర హారవల్లరుల సొంపారఁదాల్చి
వదనమండలముపైఁ బదనుకస్తురితోడ
మకరికాపత్త్రసంపదలు నించి
సిగలచుట్టును నల్లదొగలదండలుసుట్టి
నీలికోకలుగట్టి నీటుగులుకఁ
బ్రియుల నభిసరింపఁగఁగోరి వెడలుచున్న
విపులజఘనల శృంగారవేష లీల

చెలిమిఁ బాటించుఁ జీఁకట్లు కలిమితోడ
రంగురంగునఁ గలసె ననంగఁ దగుచు.

[తెరలో]

సీ. మఱుఁగఁగాఁగినపాల మఱపించు
కరముల గిలిగింత నెవఁడు పొంగించు జలధి
భువనత్రితయదివ్యభవనంబుల కెవండు
నవసుధారసలేపనంపుఁ గుంచె
సిద్ధాపథంబయి చెలఁగి యెవ్వనివెల్గు
మదనవల్లి నివుళ్ళు పొదలఁజేయుఁ
జివురువిల్తునికేళి భవనాంగణమునకుఁ,
జారుచందనపంక చర్చయెవఁడు
అతఁడు వెలుఁగొందుఁ గుంకుమన్యాసగౌర
మానినీరమ్య వదనోప మానమూర్తి
ఘటితచక్రవాకమిథున పటుతరార్తి
సాంద్రతరకీర్తి యామినీచక్రవర్తి.

మ. నలినంబుల్ మలినంబులయ్యెడు, జనా
నందుండు చంద్రుండు క
ల్గాఁ నవ్వేన్, రజనీరమావిమలము
క్తాహారతారాళి బి

ట్టలరున్ నల్దెసలన్, రథాంగముల్లు ద

గాంగంబులై పండు వె

న్నెలకాంకం గవపోకకున్ హతవిధిన్

నిందించుచుం గుందెడున్.

[తిరిగి తెరలో]

తొలుతన్ నివ్వరిముల్లుల ల్లైసఁగిఁ, తో

డ్తోఁ గేతకాగ్రిద్యుతుల్

దలఁపంజొప్పడి యంతటన్ బిసలతాకాండంబు

లావణ్యముందాల్చి, యా

వల ధారాంబువిడంబనంబులయి, యా

పైఁ దారహారప్రభా

నిలయంబై స్ఫటికంపు దండములనన్

వెల్గున్ సుధాంశుద్యుతుల్.

సు దేవా! చిత్తగింపుము.

సురదంతావళదంతఖండమునకున్

జోకైన యాకారమున్

బరఁగం దాలిచి, స్వచ్ఛమౌక్తికలతా

ప్రాలంబ లంబద్యుతుల్

నెరయం జందనపిచ్ఛిలంబుగ దివిన్

నిర్మించుచుం, బొల్చు జం

మరుఁడింతుల్ స్మరలేఖలం జదువఁగం
దోడైన దీపంబనన్.

విదూ: ఇదిగో నిది కలకంఠి యను దేవిగారి నాగరిణి. పున్నమ
చంద్రుఁడు పొడసూపఁగానే దానిమాట విని కర్పూర
చంద్రుఁ డను మాగధుఁడు చంద్రోదయవర్ణనము
చేయుచున్నాఁడు. నాకును నోరు గులగుల లాడు
చున్నది. నేను గూడ వర్ణించెదను. చీఁకటి కాటుక
జక్కఁగఁ బట్టించిన యాకసపు నల్లబల్లపయిఁ దెల్లగ
నొప్పు చుక్కల పేరి యక్కరములు జాబిలి బుడ్డి
నుండి జాలువాఱు వెన్నెలసుద్దపాలచేఁ దద్దయు మాపు
చెడుచున్నవి.

రాజు: మిత్రుఁడా! నీకిప్పటికిని జిన్నతనపు ధోరణి వదలినది
కాదు.

విదూ: సందె వార్చుచున్నప్పుడు మాత్రము కోఁతి కోఁతిచేష్ట
లను విడుచునా? పోనీలే. ప్రాఘోక్తులతోనే వర్ణించెదను,

పృథ్వి. అకంకణ మకుండలం బగు దిగంగనామండనం
బకుంకుమ మచందనంబగు ధరాబ్జ దృగ్భూషణం
బకంజమున చూత్రమై తగుసనంగ దివ్యాయుధం
బకల్మషరుచిన్ దివిన్ శశికరౌఘమే పారఁగన్.

రాజు: (అంతటనుజూచి వలవంత నభినయించి) భగవంతుఁడ

వైన. యామినీనాథ! ఇదియేమి? నీవ్యాపారము విరుద్ధ
ముగా నున్నది!

శా. క్షీరాబ్ధిన్ జననంబు; సోదరులు ల
క్ష్మీశ్రీకౌస్తుభంబుల్; సుధా
ధారాపాతము లంశుజాతము; సుహృ
ద్వర్గంబు నీలాబ్జముల్
వైరంబింతుల మోము దామరలతో; భా
వింప సర్వజ్ఞ చూ
డారత్నం బవుచందురా! నీకగునె నన్
డాయన్ శిఖిజ్వాలలన్?

(నలుదెసలు చూచి)

ఉ. లంబుగఁ గేతకోదరద
ళంబులఁ బండిన సారమట్లు నా
కొంబయి, హారమౌక్తిక మ
ణిద్యుతి నెయ్యదియొప్పె, నిష్ఠదే
చెంబుల ముంచి యెత్తనయి,
చేరల జుట్టఁగనై, మృణాళ ఖం
డంబులు గోల్లనై, పొసఁగుఁ
జంద్రిక చందముఁ జేపు సూపఁగన్.

(ఆలోచించి)

చంద్రునియొక్క స్వచ్ఛభావమే మాబోంట్లకు ప్రాణసంకటము. ప్రాణమును దీసెడివిషము స్వచ్ఛముగా నుండుటలేదా? (వేడుచు)

7. కిశోరయుఁ గాంతిమూసి కలువఱేఁడు చసంగ
విరహిజనులు వెతలు వీడి మనఁగఁ
జంచుపుటములను గ్రహించి వెన్నెలఁగుత్తి
యూరఁ గ్రోలరే చకోరులార!
(ఎదుటఁజూచి)

అదే మృగాంకావళి!

విదూ: అవును. అది మృగాంకావళియే! ఒక్కచంద్రుని కింత కాంతిసంపదయుండదు.

రాజు: కనుక మనమిప్పు డీయరఁటిచెట్లచాటుననుండి వీరి విస్రంభాలాపములను వీనుల విందుగా తనివితీఱ విందము.

(అట్లు చేయుచున్నారు.)

[తరువాత మృగాంకావళియు విచక్షణయుఁ ప్రవేశించుచున్నారు.]

మృగాం: (అనుధ్యానము నభినయించి "చందనకర్దమోల్లిఖితు" అను వెనుకటి పద్యము జదువుచున్నది.)

రాజు: (ఖేదముతో) ఓహో! ఈ కలికిపలుకులు మదన మంత్రాక్షరములుగా నున్నవి!

విదూ: అవేమో నాకు దెలియవుగాని, మన్మథహతకుని చేతి బల్లెములు వాఁడిగలవని యెఱుఁగుదును.

రాజు: మ. మెడముత్తెంపుసరుల్, చనుంగవపయిన్
మేల్తైనకర్పూరపుం
బొడియుం, గేలుఁగవన్ మృణాలవళయం
బుల్, మేనఁగందంబునున్
మఱుగుం బుట్టముఁ గల్గి భామిని నభో
మధ్యస్థుఁడౌ చంద్రుచే
విడువంబడ్డ నిజాధిదేవతయనన్
వెల్గొందెడున్ రాతిరిన్.

విదూ: అవునవును. పయినుండి యూడిపడిన చంద్రాధిదేవతయే యీమె. ఏమనఁగా నీయింతిచే నింతకుముందే విడువఁబడిన మృగలాంఛనుని మండలమధ్యప్రదేశ మందు నెపమున మాసి మచ్చపడినట్లున్నది.

రాజు: మిత్రుఁడా! పెంపునొందిన వెన్నెలవెలుఁగులో సైతము ఇవ్వెలఁదియున్న విరహపాండిమము విస్పష్టముగాఁ గనఁబడుచున్నదిసుమీ! ముత్యాలహారములో సపూసలేవో సన్నముత్తెములేవో తెలియవుగనుక నా.

గీ. చాయపసుపుఁగొమ్ము చాయలీనెడు మేన
విరహపాండిమంబు విస్తరిల్లెఁ

గాంచనంబుతోఁడ గరఁగించి రజతంబుఁ
బడఁతి మొదలు సేయఁబడెనో యనఁగ.

విదూ: పాదరసము పొక్కిన బంగారమువలె నీపువుఁబోఁడి లావణ్యము పచ్చపచ్చగను దెల్లతెల్లగను గనుపట్టు చున్నది.

మృగాం: అయ్యో! హృదయమా! దానిం జూచినవేమో కన్నులు! నడుమనః నీవుతొట్రుపడుచుండుట మిక్కిలి యాశ్చర్యముగా నున్నదే! అవును. ప్రక్కలించి కల్లుమి యుటయేమో పొగడమ్రాని మొదలను; కల్లువాసన గ్రక్కుట యేమో పువ్వులును.

విదూ: ఇట్లనుచున్న దేమికారణము!

రాజు: ఇదికారణము. దీనిహృదయము వలపుఁజెంది తగులు కొన్నది. అందుచేతనే దానితో వేఁగలేక విసిగిపోవు చున్నది.

మృగాం: కర్పూరపుఁ గణికవలెఁ జల్లనివాఁడవైన యోవిద్యా ధరమల్ల నీవును దపించుచున్నాఁడవని నాకూఱట యెట్లుగలుగును? చంద్రికాంతమణి నిప్పులు గ్రక్కుచు న్నప్పుడు చేయఁదగిన దేమున్నది?

రాజు: ధన్యుఁడను. మృగాంకావళిచే నిపుణముగా నెత్తిపో పువఁ దగినవాఁడవైనందున నే నిప్పు డెంతయు ధన్యుఁడను.

మృగాం: చెలీ! మన్మథుండు సామాన్యపుష్పబాణుండేయయిన పక్షమున మమ్ముబోంట్ల నిట్లు బాధింపఁ గలుగునా? నిశ్చయముగా నతని బాణములు విషకుసుమమయము లయి యుండవలెను.

రాజు: సలిలరూపమయ్యును మంచు దహించుచుండుట లేదా? అటువలెనే కుసుమమయ మయ్యును మన్మథుని బాణపంచకము స్వభావముచేతనే తీక్ష్ణమయినది.

విదూ: వయస్యా! వానకాలపు టిసుకబొమ్మవలె క్షణక్షణమును కృశించుచున్న యీకన్నియను జూడ నెవనికి దుఃఖము కలుగకుండును? మ్లానమయ్యును మరునక కందళి పరిమళము గలదియేసుమీ! విరహభరమున నుక్కియు నీమెరూపము మనోహరముగానే యున్నది. వసివాడియు గోరంటపూదండవలె రక్తత్వమును జక్కఁగాఁ బ్రకటనసేయుచున్నది.

మృగాం: చెలీ! యిప్పు డేమి చేయుదును? ప్రేమతటాకము కొట్టివేయ శక్యముగాకున్నది. (ఖేదముతో) సఖీ! ఆయనకు జాలి లేకున్నది. పరుల దుఃఖమునుజూచి దుఃఖపడెడు జనులు ప్రపంచమునందు లెక్కకు మిక్కిలి తక్కువగా నున్నారు. *కుసుమోత్పీడవిడం

* ఈవాక్యమునందలి యర్థము విచారణీయము.

జనముచూపకుండ ఝుంకారములుచేయుచు మ్మెదలరు దు గదా! ఓయీ! మన్మథ! ముజ్జగమునందును విలు కాఁడవన్న నీవొక్కఁడవేసుమీ! చంద్రశేఖరునిచేఁ బరీక్షింపఁబడిన తీక్ష్ణత్వముగల నీశరములచే నబలా జనమును బ్రిహరించుచు సిగ్గునొందకున్నాఁడవు! అంతే! ఆఁడువాండ్రమీఁదనే నీ యారభటి?

రాజు: ఓకుసుమకోమలీ! ఆర్భటి కాదు. ప్రచండార్భటియన వలయును.

విదూ: (పక్కునవ్వి) అనంగుని కారభటి యనఁగానే నాకు నవ్వు పట్టరాకున్నది.

రాజు: ఇదియేమి? పెద్దనవ్వు నవ్వి దీనిని బెదరఁగొట్టినాఁడవు.

మృగాం: చెలీ! విచక్షణా! యిక్కడ నెవ్వరో యున్నట్లుగా నున్నది.

విచక్షణ: అట్లయిన మన మీయరఁటి చెట్లచాటుననుండి యదియేమో తెలిసికొందము.(అట్లు చేయుచున్నారు)

విదూ: రమ్ము. మన మందుఁ బ్రవేశింతము. (అట్లుచేయు చున్నారు.)

రాజు: (శైత్యోపచారసామగ్రినిఁ జూచి చేతఁ బుచ్చుకొనుట నభినయించి)

గీ. చేతి కడియమయ్యెఁ జెలికీమృణాళ మీ
చిగురు మగువచెవినిఁ జెరువఁ బడియె
నీయరంటియాకు నింతి యంశుకమయ్యె
నతను తాప మిందు నత్తమిల్ల.

కాఁబట్టి ప్రియురాలిచే ననుభవింపఁబడి విడిచి పెట్టఁ బడిన యీశిశిరోపచారసామగ్రిచే నే నిప్పుడు తాప శాంతిఁ గావించుకొనియెదను. (అట్లుచేయుచున్నాఁడు)

(యథోచితముగా రాజును విదూషకుఁడును గూర్చు న్నారు.)

రాజు: (సంతాపము సభినయించి) అన్నన్నా! యెంత యాలో చన తక్కువపని చేసితిని.

సీ. శీతాంశుఁడని సంతసించుటయేకాని
విసముతోఁ బుట్టిన బెట్టిదుండు
చందనంబని యాసఁ జెందుటయేకాని
పాపజాతికి నెల్లఁ బట్టుఁగొమ్మ
హారంబులను నెల్లఁ బేరుమాత్రమెకాని
క్షారజలంబెకా జన్మభూమి
తమ్ములంచునుగూర్మి తబ్బిబ్బులేకాని
వేఁడి వెల్లడరింపఁ బ్రీతియెప్పుడు

అకట! వీనియందు నొకసైన మదనాగ్ని
చల్లఁ బఱచి సుఖ మొసంగఁగలదె?
తెలియలేక వీని కలరూపుఁబయివన్ని
యలకు మోసపోతి మంతెగాక.

విచ: చెలీ! మృగాంకావలీ! నాదూతీత్వము ఫలించినది. మహా
రాజుకూడ నీవలెనే అపస్మారము పాలయినాఁడు.

రాజు: (సంతాపము నభినయించి)

గీ. పవనలువీవ నిట్టూర్పు విస్తరించె
గంపము నలందఁ జెమ్మటల్ కాల్వలయ్యె
పిసలపానుపు గామాత్ర వృద్ధిచేసె
ద్విగుణ మగుగాక స్మరపీడ విఱుగడగునె?

విదూ: అహా! ముద్దరవయిచిన లేఖలాగున్నది.

రాజు: లేఖ మాత్రమేకాదు. మన్మథసంబంధమయిన సంధి
విగ్రహవ్యవహారము కూడనున్నది. ఏమంటేని చూడు,

గీ. తనుణ తాళీదళంబుపైఁ దరుణిమోహ
గుప్పచనుదోయి గంధాన గుఱుతువెట్టి
తమ్మిలేఁదూఁటి దారానఁ దనరఁగట్టి
యనుపఁదలఁచిన స్మరలేఖ యగుటనిజము.

విదూ: అవును. ఈలేఖ యాచంద్రముఖిదే. కాని యామెను
బాసి యిందెందుకున్నదో చెప్పుదునా?

రాజు: (విదూషకుని తన చెవిచెంతకుఁజేర్చి) ఒక్క వైదూర్యపు గనిలోనే రత్నశలాకలున్నవా? ఒక్క నీమాటలలో నుండియే తేనెలుట్టిపడుచున్నవా? కాబట్టి పై పేరు చూడనిమ్ము.

విదూ: (చూపుచున్నాఁడు)

రాజు: (చదువుచున్నాఁడు) "నిష్కరుణునకు" "దీనురాలి యొద్దనుండి"

విదూ: విప్పెదనుండు. చదువుదువుగాని (అట్లుచేసి) అయ్యో! మిత్రుఁడా! రత్నములులేని రతనాల బరణివలె వి దక్షరములే లేవేమి?

రాజు: పయిపేరు వ్రాసినతీరు చూడఁగనే జాలిపుట్టి హృదయము జాలు వాఱుచున్నది. (ఆలోచించి) ఓయీ! యిది తాళపత్రసంపుటము. (విమర్శించి) సంధి బంధమును జక్కఁగాఁ జూచితివేని లేఖ కనఁబడఁగలదు. రహస్యరక్షణముకయి కామతంత్రి మెప్పుడును కొంచెముగానే సూచింపఁ బడుచుండును.

విదూ: (అట్లుచేసి చూచి సంతోషముతో) ఓహో! యేమి నీబుద్ధి విభవము! రోహిణీ వల్లభుఁడని మృగలాంఛనుని వేఱే వర్ణింపవలయునా?

రాజు: (నట్టుతోఁ జదువుచున్నాఁడు.)

"గీ. అమరుఁ బరువంబు సకలాంగకములయందుఁ;
నమరు నొకవింత ప్రాగల్భ్యమందుఁ గనులఁ;
జూచి యెవ్వని హృదయంబుఁ జూఱఁగొనెనొ"

(సవితర్కముగాఁ బరికించి)

మ. తలకట్టుల్ విడిపోయెఁ గేల్వ్రాఁకుటన్;
దగ్గం బ్రిభల్ చెమ్మటన్;
గలిగించున్ మదికిం బ్రతీతియవియే
కాఁబోఁలు సంచాకృతిన్;
బలుకంబడ్డదె పల్కినట్లుగపడున్
వైచిత్రిచే ఖండవా
కృల లేఖాక్షరముల్ మృగాక్షిహృదయ
క్షోభం బెఱింగించెడున్.

విదూ: ఏమి? ముద్దుగఁ బెరఁగెడి మొలకయరఁటి యేనుఁగు తొండము బారిఁ బడుచుండఁగాఁ జూచి యూరకుండదగునా? రమ్ము వెంబడింతము.

రాజు: మిత్రుఁడా! యీ రెండును దప్పిపోవుట లేదుసుమీ-సముద్రుఁడు చంద్రికల ననువర్తించుటయు, నీవు నా చిత్తవృత్తి ననుసరించుటయు.

విదూ: (కౌఁగిలించుకొని చేతితోఁ జూపించుచు) ఇందుండి యీయిందువదన మాధవీలతామండపమును గూర్చి

వెళ్ళినది. ఇదిగో మన్మథ పదసరణివలెఁ బదపంక్తి కనఁబడుచున్నది. కనుక మెల్లగా ముందుకుఁబోయి పరికింతము. (అట్లుచేయుచున్నారు.)

మృగాం: (లతాగృహమునందు వెన్నెలసోఁకుట నభినయించి)

గీ. విరహపరితాపభరమున వేఁగునన్ను
సంతసింప చంద్రి! నవ్వుల కంటె తేని
పొరసి యుచ్చోట నుసుకొత్తి పోవఁగలవు
స్నిగ్ధసుసుందరంబులు నీకరములు.

(ఇట్లు రెండుమూఁడుసూక్తులు పలికి యేడ్చుచున్నది.)

రాజు: (విదూషకునితో) కన్నులపండువు గావించుకొనుము.

చ. గిరిగిరగ్రుహాలం దిరిగి,
క్రేవల నించుకయంత సేపు ని
ల్వరముగనుండి, యెప్పతుదలన్
లపతంగనుపట్టి, ధారలై
విరియఁగఁబాఱి, యారటము
పెల్లును వెల్లడిసేసి నైజపున్
గరిమను, గాల్వలయ్యెడును
గామిని యశ్రువు లీక్రమంబునన్.

మరియు.

ఉ. మొక్కలుబోవఁగన్ మొనలు,
పూములుకుల్ విడనాడి, ముగ్ధపై

నక్కుటికంబుమాలి, వరు
ణాస్త్రములై చె మరుండు గానిచో
గ్రక్కునఁగంటి తూము పెను
గ్రింతల వెల్వడువారిపూరముల్
మిక్కిలియున్ భజించునె వ
లిత్ప్రియకాననసారణీతులన్.

(విదూషకుని చేయూఁతఁగొని చెంతఁజేరి యనురాగ
ముతోను, అనుశయముతోను)

౯. నాతియంగకములు ననుఁగూర్చి లేఁదమ్మి
తూఁడులట్లు నలిగి వాడె నకట!
యతివఁగూర్చి యేను నట్లయైతిని మద
నుండు చండశాసనుండు తలఁప.

కాఁబట్టి సమసుఖదుఃఖభాజనుఁ డగు నీ జనుఁడు నీ యనుగ్రహమునకు దోసిలియొగ్గి వేచియున్న వాఁడు.

మృగాం: (సాభిలాషముగాను ససాధ్వసముగను రాజుం జూచి తనలో) ఏమిది! మబ్బులేనివాన! ముత్తెపుఁజిప్పలులేని ముత్యాలపంట! ఉమ్మెత్తకొమ్మ తియ్యమామిడి యయినట్లును, ఇత్తడి పుత్తడియయినట్లును, పనికిమాలిన యీ నాశరీరము మహారాజసందర్శనముచే వెలలేని

దిగాఁ జేయఁబడినది. (పెడమొగముగా విచక్షణతో)
చెలీ! యితఁడేసుమీ! ఆమహారాజు విద్యాధరమల్ల
దేవుఁడు! ఇతఁడేసుమీ శ్రీ సరస్వతులకును, మదన
సుందరికిని వల్లభుఁడు. ఇతని కేసుమీ శ్రీయును,
సరస్వతియును, మదనసుందరియును, వల్లభురాండ్రు.

విద: అవును.

రాజు: విచక్షణా! చెప్పవలసినక్రమమిది "ఇతఁడేసుమీ
మృగాంకావళి వల్లభుఁడు. ఇతని కేసుమీ మృగాంకా
వలి వల్లభురాలు" అని; (దోసిలిపట్టి నాయికతో)

గీ. చెలువరో నల్లగల్వలకు
సిగ్గొదవంగడగంటఁ జూడవే!
తెలతెలఁబోవు విదుమము
తీయని వ్మోవిస్ఫురింపఁ జేయవే!
శోభుకుఁ బసిండికింగసట్లు
బాకొనుమైజిగి యింతనింపవే!
పోలుచు ద్విచంద్రమై నభము
ముద్దుమొగం బొకయింత యెత్తవే.

మృగాం: (తనలో) భగవతీ! త్రియామా దేవీ! శశాంకభూషితు
రాలవై శతయామవుగమ్ము.

రాజు: మిత్రుఁడా! యీలతాంగికి హారలతావిరహముఁ గలి గించుటతగదు. చిత్రశిఖండిదామములేకుండ నుత్తరపు దిక్కు ప్రకాశింపదుగదా! (తనకంఠమునుండి హార మునుదీసి నాయికకంఠమునందు వైచుచున్నాఁడు.)

విదూ: ఉచితసమాగమ మెవ్వరినిరంజింపదు? సంస్కృతుల్యాల సుబ్బనరములుదాల్చెడి సుందరీజనమును, వక్రోక్త్య లంకారములచే వఱలుచుండెడి సుకవివర్యుల వాగ్గుంభ నమును, ఇవియన్నియు రంజకములుగానే యుండును.

[తెరలో]

లతామండపాదులయిన కేళిసదనములను విడిచి పెట్టుఁడు. ప్రక్కతలుపులుమూసి గడియలు వేయుఁడు. రాత్రి కావలికయి నియమింపఁబడిన కంచుకిజనములు వారివారి కేర్పాటయిన స్థానములయందు వెలుపల నిలిచియుండఁ గట్టడసేయుఁడు. ఇదిగో పట్టపగలు లాగున వారవిలాసినులుపట్టిన చేతిదివ్వెలు వెలుఁగు చుండ, దేవిగారు సిద్ధనరేంద్రుని యౌషధప్రభావ ముచే వేలకొలఁది పరిగుత్తులతో విజృంభిఁచుచున్న మాధవీలతామండపమును జూడవచ్చుచున్నారు.

విదూ: (భయముతో) భర్తగారు ప్రియసఖిని విడుతురుగాక!

# తృతీయాంకము

రాజు: నాకు ఆశాభంగముం గలిగింపదేని విడువవలసినదని హృదయమును బ్రార్థించెదను.

విదూ: వయస్యా! త్వరితముగా విడిచివేయుము. విడువవేని పావురపుం బిట్టలవలెం బంజరములోం జిక్కుపడం గలము.

(తల యొక దిక్కుగా నిటునటు దిరిగి యందఱు నిష్క్రమించుచున్నారు.)

# చతుర్థాంకము

●

(తెరలో)

శ్రీమత్కస్తూరవర్షమహారాజుగారికి   సుప్రభాతము ఇప్పుడు!

గీ. వెండిగుండువోలె వెల్లనై శశి గ్రుంకు
బుడగ లట్లు చుక్క లడఁగుఁ? బలుకఁ
బాలుదివెలు తెల్లగోరఁటల్ బలెఁ; దూరు
వరుణ మగుఁ జకోరి యత్తు లట్లు.

[తరువాత మేలుకని విదూషకుఁడును, సుప్తరాలయి బ్రాహ్మణియుఁ బ్రవేశించుచున్నారు.]

విదూ: అవునే! పిల్లవాండ్ర తల్లీ! లేవవేమే సంధ్యావందనము చేసికోవలెను. లేలెమ్ము తెల్లవాఱు వచ్చుచున్నది. అదిగో విను మహారాజుగారి వైతాళికుఁడు కస్తూర చంద్రుఁడు భోగావళిం బాడుచున్నాఁడు. (విలపించి) ఏమిదీ? రాత్రియంతయు దేవిగారితో మంతనములాడుచు మేలుకొని బడలిక నొందినదగుటచేఁ గాబోలు నిని

కిప్పటికిని నిద్దురబద్ధకము వదలకున్నది. కానీ మెలఁకువ వచ్చెడి వఱకును కనుపెట్టుకొని యుండెదను. సుఖసుప్తులను లేపఁగూడదని పెద్దలు పలుకుచున్నారు.

[బ్రాహ్మణి కలవరించుచున్నది.]

బ్రాహ్మణి: దేవిగారు భర్తగారితో విచక్షణాముఖమునవిన్నవించినారు. ఏమని? "ఓల్లాగతుఁడైన మృగాంకవర్మను జూడఁ గోరి యాతని సోదరి మృగాంకావళి యను సుందరి యిందులకు వచ్చియున్నది. అక్కన్నియను పెండ్లియాడు నేలజేఁడు చక్రవర్తి కాఁగలఁడని జ్యోతిషికులు తెలిపియున్నారు గనుక, నీవే యనుకూలుఁడైన వరునిఁ జూచి నీ తోఁబుట్టువు నిచ్చి పెండ్లి చేయవలసినదని మా మేనమామ శ్రీచంద్రవర్మయు, మాయత్త హారలతాదేవియు నాతోఁజెప్పఁ బంచినారు. ఇక్కలికిమిన్నకు మీకన్న యోగ్యుఁడగు వరుఁడు వేఱొక్కఁడు గానరాఁడు. ఏకావనలంకరించునది పద్మరాగమణి యొక్కటియే. కనుక దప్పక యార్యపుత్రుఁడు పరిణయము కావలయుననియు, నాత్మవశ్యురాలయిన లక్ష్మి నన్యహస్తగతురాలిం జేయఁదగదనియు జేవి దేవరతో విన్నవించుచున్నది. ఇదేమి దేవి సవతి పోరు దెచ్చి పట్టుకొను

చున్నది? అని శంకింపఁ బనిలేదు. మహావంశజాతలైన పతివ్రతల కెప్పుడును పతి ప్రియమే ప్రియము కాని వేఱొక్కటి గాదు. అదియునుఁ గాక ఆర్యపుత్రున కీవఱకు మగధాధిపతి కూఁతునసంగలేఖను, మాళవ నాథతనూజను రత్నావళిని, పాంచాల రాజపుత్రిని విలాసవతిని, అవంతీశ్వర సుతను కేళిమతిని జాలంధ రేశ్వరకుమారికను లీలావతిని, కేరళరాజ తనయను పత్రలేఖను, ఔక్కుమాఱులు పెండ్లి చేసియున్నదా నను. కనుక నేఁడు రెండవ యామమునఁ బెండ్లిలగ్గ" మని ఇట్లు మఱిమఱి చెప్పంబడినవాఁడై మహా రాజందులకియ్యకొనెను. కనుక నాఁటి మేఖలావృత్తాం తమునకుఁ బ్రతిక్రియగా బూటకపుఁ బెండ్లిచేసి మహా రాజును మోసపుచ్చవచ్చును. మృగాంకవర్మకుఁ గోపము వచ్చినయెడల సతనికిఁ గువలయమాలను బెండ్లి చేసి సమాధానము చెప్పవచ్చును.

మా: (నవ్వి) సరేలే. ఇందెవ్వరు మోసపోవుదురో చూచె దము గాని (ఆలోచించి) ముందీ ముసలి సిద్ధిచే పాలని గంజిఁ దాగించవలెను. ఆవెనుక కువలయ మాల సంగతి చెప్పనక్కఱలేదు. అమ్మాయి కమ్మాయి నంటఁగట్టినప్పు డాముద్దుగుమ్మవని పెద్ద

మోసమేకదా! (పయికిఁ జూచి) అబ్బో యెంతవేళ యైనది! బ్రాహ్మణిని లేపెదను. ఓసీ! యింటిదానా! లే. లే. దేవిగారు రమ్మనుచున్నారు.

బ్రాహ్మ: (మెలఁకువ నభినయించి లేచి) అబ్బో! వేకువజాము నడచుచున్నది. (మగనిఁ జూచి) ఏమండోయి మృగతృష్ణికాదేవి యల్లుఁడుగారు! మీరీపాటికి ప్రభువువారి ప్రక్కను జేరుండి. ఇంక నేను దేవిగారి వెంట నుండెదను. (ఇద్దఱు నిటునటు నడచి నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రవేశకము.

[తరువాత రాజును విదూషకుఁడును ప్రవేశించుచున్నారు.]

రాజు: (మదనాతపముల పీడ నభినయించి) సఖుఁడా! ఇప్పుడు గ్రీష్మసమయము శైశవదశ నతిక్రమించినది సుమీ!

గీ. వేగుజాముల నోదవు సంభోగవాంఛ
కురుడు లయి గట్టిపడెడుఁ గొబ్బరుల నీళ్లు
లార ముగ్గుచుఁబండిబొంతరఁటిపండ్లు
తగ దినాంతభోగ్యములౌ నిదాఘవేళ.

మఱియు

మత్తకోకిల.

మంచిగందము మల్లెపూలు హిమద్రవార్ద్ర మృదూత్తరీ
యాంచలంబులు తమ్మిదూడ్లుల యంగదంబులు లోనుగన్

మించుఁబోండ్లకు గ్రీష్మవేళను మించుగా నొదవన్ మృతుం
బంచబాణునిఁ గ్రమ్మరింపఁగ మంత్రతంత్రము లేటికిన్.

విదూ: అవును. ఈగ్రీష్మఋతువు మాఁబోటి బట్టతలల వాండ్రి మీఁద నిప్పుకలు గురియును.

రాజు: (నవ్వలేకనవ్వి) పయిని నెత్తిమాఁడుచున్నది. క్రిందను కాళ్లు గాలుచున్నవి. అందుచేతనే రాజవల్లభ లసూర్యంపశ్య లయి యున్నారు. మఱియు

ఉ. వీనుల విందు సేసెడును
బిల్లనగ్రోవి మనోహరంబుగా
నానఁగఁ గోర్కె వుట్టు శిశి
రాంబు కరంబితవారుణీరసం
బౌను హిమోపమంబులు మృ
గాక్షుల సిబ్బెపు గబ్బిగుబ్బలున్
వీనికిఁ బైనిఁ గెంజిగురు
విల్తుప్రసాదమహాత్వ మొప్పగున్.

మిత్రుఁడా! పెద్దలి ట్లనుచుండగా వినుచుందుము సుమీ!

గీ. చక్కెర యనంట్లు వలపారు జాజిపత్రి
దిరిసెనపుఁ బూలు కురువేరు స్ఫురదశోక
పల్లవంబులు గందంబుఁ దొల్లిగ్రీష్మ
మొసఁగెఁ గాలినమదనున కుడుకడంగ.

(తాళఁజాలమి నభినయించి)

## చతుర్థాంకము

గీ. ఏక కాలక్రమంబున నివ్వి రెండు
నరయ శిశిరోపచార యోగ్యములు గావు
భీష్మముగ నెండ గాయు నీగ్రీష్మమొకటి
ప్రియజనంబుల నెడఁబాయు పీడ యొకటి.

(తెరలో)

ఇదిగోఁ దూఁగుటుయ్యాల లెక్కి చక్కని యడుగు దమ్ముల ముందుకుఁ జాగించుచుఁ బిఱిందికిఁ గుంచుచు మించు వేడుకల నూఁగులాడు చెలికత్తెలు చేతులఁ బట్టి యెండకాఁకకుఁ జీకాకు గొలుపు కాలియందియలఁ జీలసందులు సడలించి యెడలించు చున్నారు. సయ్యోద్ధగఁ గలసి యూఁగుజతకత్తియల కేలుఁగవ లత్తమిలి యెత్తుకొనఁ బొత్తుసెడి కడలనుండి సడలి యురలెడి పయిఁడిమువ్వల గుదులు గల మొలనూలెడ గలుగనుంపఁ బడుచున్నది. బడుగునడుమున నుంత సడలు అవిక కప్పున నొప్పుమీఱు గబ్బిగుబ్బల మీఁది వలిపెంపు వల్లెవా టూర్ధ్వప్రసారితంబు లగు కరాగ్రంబుల కర్షణంబునఁ దొలఁగింపం బడుచున్నది.

రాజు: (చెలికత్తెలతోడి డోలికా విహారమును దలఁచి విదూషకునితో)

సఖుఁడా!

గీ. మదనసంతప్తయైన యీ మధురవాణి
యెదను నిను నిల్పి చెలులతో నెనసి యూఁపు
గులుక డోలావిహారంబు సలుపునేని
వీఁక గెలుపూను విలుపూనుఁ గాక మరుఁడు.

విదూ: పాణిగ్రహణపూర్వకముగా నీ కాత్మార్పణము చేయుటకుఁ ద్వరపడుచున్నదని విచక్షణ నిన్నసాయంకాలమే కాదా నీతోఁ జెప్పినది?

రాజు: అవును. అప్పుడామె యీప్రకారముగాఁ గూడఁ జెప్పినది.

గీ. పూగమును బెనగొనుఁ గాక నాగవల్లి
కలువరాయనితోఁ రేయి కలయుఁగాక
నిన్నుఁ బొందెడుఁ గాక యీనీరజాక్షి
వీఁక గెలుపూను విలుపూనుఁ గాక మరుఁడు.

విదూ: అవునుగదా? ఇంక సంశయ మెందుకు?

రాజు: సంశయములేదు. (తటుకునఁ జూచి) మిత్రుఁడా! ఇదిగో చూడు! నాలవపాదమును బూర్తిచేసి నాఁటి పద్యమును గానుకగా నుంచినది!

విదూ: ఏకీ! వీనుల విందుగ విందు నాపద్యము నొక్కమాఱు చదువుమీ;

(చదువుచున్నాఁడు.)

"అమరుఁ బరువంబు సకలాంగకముల యందు
సమరు సోకవింత ప్రాగల్భ్యమందుఁ గనులఁ;
జూచి యెవ్వని హృదయంబుఁ జూఱగొనెనో
మనసు పడియెదు మరల నా జనునిఁ జూడ."

మఱియు

తనదు మెడనుండి తిగిచియెద్దానిఁ దొలుత
నాదు మెడవైచె నాతి స్వప్నంబు నందు;
నేది తత్కుచ సీమనే విడితి నవల;
నదియె కానుక యయ్యెను హారమిందు.

: (స్మరణము నభినయించి) ఇదిగో నొక్క రహస్య మడి గెదనుగాని చెప్పెదవా?

: చెప్పకేమి?

: మృగాంకావళీకువలయమాలలకు నెంత యంతరము?

: ఊరకుండు. పరకళత్రి ప్రసంగములు బాగుండవు.

: మీరాజులయిండ్ల వ్యవహారములు నాకుఁదెలియవు కాని మాబోఁటి పల్లెటిదిక్కువాండ్రు "ఎక్కడను దిక్కులేనప్పు డక్కమగఁడేదిక్కని చెప్పుకొనుట కలదు లెండి. కా నున్న సవతులగుటచే మృగాంకావళీ కువ

లయమాల లక్కసెల్లెం డ్రగుదురు గనుక, అడిగి నాను. చెప్పుదువు? ఎంతయంతరము?

**రాజు:** నీతర్కపాండిత్యము కొనియాడఁ దగినదిగానున్నది. కాని మృగాంకావళీ కువలయమాలల కెంతయంత రము!

**విదూ:** సరే! బాగున్నది. అన్నమాటయే యనుటవల్ల నాకేమి సమాధానము చెప్పినట్లు?

**రాజు:** అటయిన నీకు మఱియొకదృష్టాంతమును జెప్పెదను. ఘనసారమునకును అగరు సారమునకు నెంత యంతరమో

**విదూ:** ఇంకను చక్కఁగా దెలిసినది కాదు.

**రాజు:** తెలిసికొనుము.

ద్విపద.

పసమీఱి సంపెంగ పసనిమ్మైచాయ
తెసఁగు మిత్రుఁడ! లాట నృపవరాత్మజకు;
గఱిక జొంపపు గరగరికల్ పొసంగు
మెఱుఁగుఁ జామనిచాయ మేని కుంతలికి;
నవరత్నమయభూషణము లదితాల్చు,
ధవళముక్తాదామతతి నిదిపాల్చు;
సిసువుసు నీకీతి నించువిల్తునికి
నజమరలేని విహారధామములె;

యైనలావణ్యా పణ్యాంబైనలాటి
మేనికెవ్వియుఁ బుడమినిలేవుసాటి.

సఖుఁడా! యెక్కడిమాట? నిజముగా నాకు దేవి పెండ్లి చేయునా?

విదూ: కూర్చుండఁబెట్టి వడ్డించుచుండఁగా భోజనమునకుఁ బిల్చెదరాయని యడిగెద వేమి? (ఎదుటఁ జూపించుచు) వాహుగో! తత్సంబంధినులైన చేటికలు వచ్చుచున్నారు.

రాజు: ఎవరి సంబంధినులు?

విదూ: దేవిగారిసంబంధినఃలు.

రాజు: (నవ్వి) అటయినరమ్ము. చిత్రశాలికం బ్రవేశింతము. (అట్లు చేయుచున్నారు.)

[తరువాత పేటికలు చేతఁబట్టుకొని చేటికలు పరిక్రమించి ప్రవేశించుచున్నారు.]

ఒకతె: చెలీ! తరంగికా! యిప్పుడు మహారాజు నెక్కడఁ జూతుము?

ఇంకొకతె: చెలీ! విచక్షణా! యెక్కడనా? చేరువగుచున్న పెండ్లివేడుకల సందడి యెక్కడ నెక్కువగనుండునో

మఱియొకతె: ఒసీ! విచక్షణా! తరంగిక యభిప్రాయమేమి? వేల కొలఁది దేవేరులను బెండ్లియాడిన మహారాజునకుఁ బెండ్లివేడుకనఁగా నేపాటిది?

వేఱొకతె: ప్రియసఖీ! విచక్షణా! కామతంత్రము నెఱుఁగని దానివలె మాటాడెద వేమి? "ప్రేమఁగాముకుల్ నూతన ప్రియులుగారె" అని వినియుండవా?

తరంగిక: (ముందుచూచి) వీరుగో! భర్తగారు! ప్రభాత పూర్ణిమాచంద్రుఁడుంబలె వెల్లఁబాఱి కృశించినవారై, శనైశ్చరుండునుంబోలె నార్యచారాయణుండు తమ్ము వెంబడింపనిదిగో! నీచిత్రశాలికాద్వారమునఁ గానఁబడుచున్నారు. (అందఱును చేరఁబోయి) జయము! భర్తగారికి జయము! "లగ్నము సమీపించుచున్నది. ఈవస్త్రాభరణములచే నలంకరించుకొని వివాహవేది నధిష్ఠింపవలయును." అని దేవిగారు మనవిచేయుచున్నారు.

రాజు: సరే దేవిసెల వెట్లో యట్లే.

విదూ: (తన్నుఁ జూచుకొని) అయితే పెండ్లికొమరునివఱుపు వారికి విడిది, భోజనము వీని మాట యేమిచెప్పినారు?

చేటికలు: మీకు భోజనమునకుఁ గావలసిన వన్నియు వడ్డించెదము.

విదూ: ఏవేవి?

చేటికలు: అశోక దోహదాలు, హారచూడాభరణాలు.

విదూ: (దండకాష్ఠము నెత్తి) ఆఁ! బానిసకూఁతులారా! మహా రాజుగారి ప్రియవయస్యుఁడను పింగళికాబ్రాహ్మణునికి

వల్లభుఁడను స్వసూత్రార్థ పాదములను జక్కఁగా నధ్యయనము చేసినవాఁడను. మహాబ్రాహ్మణుఁడను. అటువంటినన్నుఁగూడ నధిక్షేపించుచున్నారే? ఇదిగో మీలాటిచేటీజనుల చిత్తవృత్తివలెనే కుటిలమైన యీ దండకాష్ఠముతో మీమొగముఁజూచిన మిండగాండ్రకు రోఁతవుట్టునట్లుగా జేసెదను.

తరం: అయ్యా! కోపపడకు! కోపపడకు! చనువుచేతఁ నీతో దేవిగారి విలాసినులు కొంచె మెక్కసక్కె మాడుచున్నారు.

మఱియొకతె: ఎక్కసక్కెములుచాలును. చారాయణయ్య వారు దుర్వాసుఁడు.

తరం: ఇప్పుడే సువాసుఁడు కాఁగలడు. ముందు వివాహోచితము నడుపుదము. సులక్షణా! హారయష్టి! కలకంఠి! వసంతలతా! మంగళికా! కామకేళీ! మృగాంకలేఖా! వకుళావళీ! పరభృతికా! విచక్షణా! కల్పలతా! రసికశిఖామణియైన మహారాజునకు కంకణముగట్టి కళ్యాణదీక్ష యొసఁగుఁడు.

[అందఱును రక్తాంబర కుంకుమ కంకణ కుసుమాదికమును దెచ్చి యందిచ్చుచున్నారు.]

రాజు: (ధరించుచున్నాఁడు.)

విదూ: (మిగిలిన చందనములో సగము దానింగొని పూసికొను చున్నాఁడు.)

విచ: ఏమేంయూరకున్నారు.? ఇప్పటి వేడుకలే వేడుకలు. మీారందఱును గూడి యాడుఁడు. పాడుఁడు.

విదూ: వయస్యా! వీరినడుమను నేనుగూడ ఆడెదను. పాడెదను.

రాజు: నీయిచ్ఛ వచ్చినట్లు చేయుము.

[విదూషకునితో నందఱును ఆడుచుఁ బాడుచున్నారు.]

[తెరలో]

ఏమే! ఓవిచక్షణా! ఓచేటికలారా! యేలయాలస్యము చేయుచున్నారు? మహారాజుగారిని వివాహమండపమునఁ బ్రవేశపెట్టుఁడు. పరివారముతోఁగూడ దేవి వచ్చియున్నది.

విచ: ఇటు. ఇటు. మహారాజా!

(అందరు నిటు నటు నడచుచున్నారు.)

(తరువాత దేవియు, పెండ్లికూతురు వేషముతో మృగాంకావళియు, నదేతీరుగా కువలయ మాలయు బ్రవేశించుచున్నారు.)

దేవి: (పెడమొగముగా) వత్సా! కువలయమాలా! నీ మగని కిషరిన యాడువేషమును జూచితివే?

కువ: (తలవంచుకొన్నదియై నవ్వుచున్నది.)

చతుర్థాంకము

(తనలో)

పగ లగుదును దాపంబునఁ
బాగులుటచే; నిదియుఁ జంద్రముఖి యగుటను రే
యగు; నిఁగ మానడిమిని నె
త్తఁగఁబడు నీ యట్టి తెరయుఁ దగు సంజయసన్.

ఆర్యపుత్రా! తెరదిగిచి దీని మొగమును జూచితిరేని భవనగర్భమునఁ జంద్రబింబ ముదయింపఁగలదు.

(కూర్చుండి యట్లు చేసి తనలో)

తమ కులపతి చంద్రుఁడు కాం
త ముఖముచే నోటు వడఁ గనలి కువలయ మ
త్కిమిష నిరువక్క లయిన
ట్లిమరుం దను ముక్కుదూల మరి కట్టంగన్.

బిడ్డా! మృగాంకావళి! తారాదర్శనము చేయుము. పర
పుగ విరిగల్వ రేకులను విస్తరింపుము.

:०: (సిగ్గుచే నిటునటు కన్నులను బఱపి తడవుగఁ బయికిఁ
జూచుచున్నది.)

(తనలో)

ఇలు నిండించుచు ముత్తియంపుసరులన్
హేలాగతిన్, దిక్కులన్
మొలకెత్తించుచుఁ గేతకీదళములన్
వ్యోమావకాశంబునన్

గలుగం జేయుచు దుగ్ధముగ్ధమును రా
కాచంద్రికాపూరమున్
జలజాతేక్షణ వీక్షణంబులు విలాప
ప్రోక్షణంబుల్ దగున్.

విదూ: (జనాంతికముగా) ఈకువలయమాల నిన్నుఁ దన తెలి మొరగంటిచూపు కోపులచే దిగఁ దాఁవుచున్నట్లు చూచుచున్నది.

రాజు: అవును.

ఉ. వాలికలై పరీణాళికల
భంగి నెసంగు నపాంగ రేఖలన్
జాలువు వారుచున్, శశధర
జాలము ఫాలము నేలఁ జాలుచున్
జాలుచుఁ బుష్పబాణునికిఁ
సర్వధనం బొసఁగన్, మృగాక్షియు
ద్వేలకటాక్షమాలికలు
పెంపు నతింపగఁ సద్వితీయమూ.

ఏమిప్రయోజనము? ఈమె పరకళత్రమే కదా?

విదూ: స్నేహాగతిచే ఈమె నీకళత్రమే యగును.

దేవి: (జనాంతికముగా కువలయమాలతో) మహారాజుగారిచే బుస్తె గట్టించుకొనుచున్న నీ మగసిం జూతుము. (ప్రకా

శముగా) ఆర్యపుత్రా! అగ్నిహోత్రమునకుఁ *బ్రద
క్షిణము చేసి లాజహోమము చేయుఁడు.

రాజు: (పరిణయమయి కూర్చున్నాఁడు.)

ప్రతీహారి: (ప్రవేశించి) దేవా! దేవిగారిమేనమామ యగు
చంద్రవర్మగారి యొద్దనుండి వచ్చిన రాయబారితోఁ
గూడ శ్రీభాగురాయణుండు ద్వారముకడ వేచి
యున్నవాఁడు.

రాజు: (దేవివంకఁ జూచుచున్నాఁడు.)

దేవి: త్వరితముగాఁ బ్రవేశపెట్టుము.

ప్రతీ: చిత్తము (నిష్క్రమించుచున్నది.)

[తరువాత భాగురాయణుఁడును, దూతయుఁ బ్రవేశించు
చున్నారు.]

ఉభయులు: త్రిలింగాధిపతులైన దేవరకుఁ జయము. జయము.

భాగు: ఇతఁడు లాటాధిపతిదూత.

రాజు: కూర్చుండుము. చంద్రవర్మకు కుశలమా?

దూత: దేవానుగ్రహముచేత.

దేవి: మాయత్త హారలతాదేవికి కుశలమా?

దూత: మఱియేమి?

* ఇక్లే 20వ పుటలో 13వ పంక్తియందు సవరించుకొని చదువ
కోనవలయును.

దేవి: మా యత్తమామలు మమ్మును దలంతురా?

దూత: మిమ్మును దలంపకుండు లేని తమ్మునే తలంపరు. (దేవి నిగూర్చి) మాతుల పుత్రోత్పత్తిచే మీయదృష్ట మేపారుచున్నది. (అందఱును హర్షము నభినయించు చున్నారు.) మాప్రభువుగారు నన్నిట్లు చెప్పం బంచినారు.

క. "కొడుకులు లేక మృగాంకా
వలియే కొడుకనుచుం జెప్పంబడె మును నాచేం
గొడుకను మిషనయ్యెడనది
యిడుకొక రక్షింపం బడియె మీ సచివునిచే."

శా. "నా వంశంబు ప్రకాశ మొందంగలిగెన్
నాకిప్డు పుత్తుండిడేకన్
నీ వీబాలను సాధుశీలను గళా
నిష్ణాతం గేళీరతన్
దైవజ్ఞోదిత చక్రవర్తి గృహిణీ
స్థానిన్ మృగాంకావళిన్
శ్రీవెంపాలెడి యొక్క భూవిభునకున్
శీఘ్రంబ యీయందగున్."

రాజు (తనలో) నీతివృక్షము నల్లుకొనిన నా బుద్ధిలత యిప్పటికి ఫలించినది.

విదూ: (చేయి పయికెత్తి) ఓహో! రాయబారి! ఇచ్చుటయుఁ బుచ్చుకొనుటయు రెండును అయినవి. చూడుము ప్రియుఁ యస్యని యొక్కయు మృగాంకావళియొక్కయు ముంజేత సలంకారముగా తొగరుదారముతోఁ గట్టఁబడిన పెండ్లికంకణము నీకుఁ గనఁబడుట లేదా? (అందఱును విస్మయము నొందుచున్నారు.)

దేవి: (జనాంతికముగా) చూడుము! దైవదుర్విలసితము! "నవ్వులన్నియుఁ బువ్వులై నివ్వటిల్లె" నన్నట్లు నేను నవ్వులాట కుపక్రమించినది తుదకు సత్యముగాఁ బరిణమించినది! కానీ! యిప్పుడిట్లుగానీ! (ప్రకాశముగా)అయ్యో! మామగారు సందేశ మంపనక్కఱ లేకయే నేను దీనికిఁ బెండ్లిచేసితిని.

ధూత: దేవి! మీవంటివారి బుద్ధివిశేషము యాదృచ్ఛికముగా నైనను మంచి ప్రయోజనము నే యనుసరించునుగాని వ్యర్థపోనేరదు.

విదూ: (జనాంతికముగా) మిత్రుఁడా! దేవి పశ్చాత్తాపములోఁ బడినది.

రాజు: కాని దైవమనుకూలుఁ డైనప్పు డందఱకు మేలే కలుగును.

దేవి: (జనాంతికముగా) మనము కానకపోతిమి గాని, మనము చేసిన పొరఁబాటు వీరుభయులును గలిసి చేయుచున్న యాలోచనకు సహాయకారి యైనది.

మేఖల: దేవితోలుతఁ గనఁబఱచిన యౌదార్యసంపత్తి నిప్పు డును బ్రకటింపఁదగును. జలము గతించినవెనుక సేతుబంధమేల? సూత్రధారణమయినవెనుక నక్షత్ర పరీక్షయెందుకు?

విదూ: ఓ అమాత్యచూడామణీ! భాగురాయణా! అభినవ చాణక్యుఁడవయ్యా నీవు. ఈకువలయమాలనుగూడఁ బ్రియవయస్యుఁడు ధరింపవచ్చును. అందుకు స్మృతి ప్రమాణము కావలసినయెడల నిదిగో వినుండి.

క. "సతియయి సుతుడయి సేవక
తతియయి మఱియితరులగుచు ధనహీనజనుల్
క్షితి నెవ్వాని దరిఁ జేరుదు
రతని ధనమగుదురు వారలయ్యోగతులన్.

దూత: ఓహో! మహారాజునకు నర్మసచివుఁ డగుచారాయ ణుని స్మృతిపై శారద్యము.

భాగు: చారాయణుఁడు చెప్పినది బాగున్నది. దేవీ! యింక నేమి? ఈకంకణములతోనే యీమెకుఁగూడఁ బెండ్లి చేయింపుము.

దేవి: మహామాత్యుఁడు చెప్పినట్లే కానిండు.

విదూ: (కువలయమాల హస్తమును బట్టుకొని రాజుహస్త మునసుంచి)

*శ్యాలభార్య యర్ధ భార్య, యను ముతుకసామెత యున్నదిగాని, నీకుమాత్రము పూర్ణభార్యయే యైనది. (అందఱును నవ్వుచున్నారు.)

దేవి: (సిగ్గును ఆశ్చర్యము నొందుచున్నది.)

విదూ: (చేటికలతో) పెండ్లిమీఁదఁ బెండ్లి! ఆడరే! పాడరే! నేనును ఆడెదను పాడెదను. (అట్లుచేయుచున్నారు.)

మృగాం: (పెడమొగముగా హర్షముతో) కువలయమాలా! రావే నన్ను గౌగిలించుకోవే. ఆర్యపుత్రుని చెట్టఁబట్టి నాకు సవతివైతివి.

భాగు: (కుడికన్నదరుటను సూచించి జనాంతికముగా) కుడికన్నదరుచున్నది. ఇంతలోనే హర్షకారణ మింకొకటి యేమయియుండును?

* బంగాళిదేశమువందల్లుఁ డత్తగారితో హాస్యమాడుట తప్పుగా నెట్టే, మహారాష్ట్రదేశమందు ముఖ్యముగాఁ బల్లెటిసీమలయందు పురుషునకు శ్యాలకునిభార్యతో సరసమాడుట తప్పుగాదనిఁతో చెదురు. ఇక్కడ మృగాంకావళి రాజునకు భార్యయగుటచేతను, ఆమెకు లేని సోదరుఁడొకఁడు మృగాంకవర్మయని కల్పింపఁబడియుండుటచేతను, కువలయమాలను ఆ మృగాంకవర్మకిచ్చి పెండ్లిచేయవలయునని దేవి సంకల్పించియుండుటచేతను, కువలయమాల రాజునకు శ్యాలభార్య (బావమఱఁది పెండ్లాము) వంటిది అయినదని తెలిసికొనవలెను.

ప్రతీహారి: (ప్రవేశించి) దేవా! శ్రీవత్సుఁడను సేనాపతియొద్ద నుండి లేఖఁగొనివచ్చి కురంగకుఁడు ద్వారముకడ వేచి-యున్నాఁడు.

భాగు: ప్రవేశపెట్టుము.

ప్రతీ: (నిష్క్రమించుచున్నది.)

కురం: (ప్రవేశించి ప్రణమిల్లి) జయము! జయము దేవా! (లేఖ నిచ్చుచున్నాఁడు.)

భాగు: (పుచ్చుకొని చదువుచున్నాఁడు.) స్వస్తిశ్రీ కర్పూర వర్ష మహారాజ!

శా. దేవా! దేవరదండనాథుఁడు వినీ
తిన్ నమ్రుఁడై యెంతయున్
రేవాతీర విరాజమాన *నృపురిన్
శ్రేయస్స్థితిన్ ధన్యుఁడై
శ్రీవత్సుండిదె సానురాగ ♦మురళీ
దృక్సేవ్య మానాంఘ్రిరా
జీవద్వంద్వసమర్పితాంజలియునై
సిద్ధిన్ నివేదించెదున్.

* ఇది యిప్పుడు నడిమి పరగణాలలో నర్మదాతీరమున నరసింహ పురి (Narsingpur) యను పేరఁబరగుచున్నది.

♦ మురళ దేశస్త్రీలు.

‡ కరచుళివంశ తిలకాయమానులగు దేవర ప్రతాప విశేషము చేతను, మహామంత్రి భాగురాయణునిమతి వైశద్యము చేతను, నాబోఁటియలఁతిబంట్ల యాజ్ఞానిర్వహణము చేతను, ప్రాచీప్రతీచ్యుదీచీ దిక్కులంగల దండిమగలగు రాజులెల్లరు దండింపబడినారు. ఒక్కదక్షిణపు దిక్కునంగల నేలయేలికలుమాత్రము నిలువంబడియున్నవారు. నిజవంశజునిచే నపహృతరాజ్యుఁడయి దేవరను శరణుసొచ్చిన వీరపాలుఁడను కుంతలేశ్వరుని, దేవరయానతిచొప్పున, ముందిడుకొని ♦ పయోష్ణీతీరమునఁ బాళెంబు దిగితిమి. అప్పుడు

సీ. యుద్ధతంత్రమునందు బుద్ధిచాతుర్యంబు
హావణించు మేటికర్ణాటనృపతి
పంతంబు మెఱయంగఁ గుంతంబు చేఁబూని
తలమీఱివచ్చు కుంతల విభుండు
చండాసిదండప్రచండుఁ డౌపాండ్యుఁడు
సింహ విక్రమశాలి సింహళుండు

‡ ఈ కరచుళి వంశ్యులకు హైహయులనియు, పేరుకలదు. వీరు ఋక్షవింధ్యపర్వతములనడుమను నర్మదాతీరమున [జబ్బల్పూరు నకు దిగువను, భీరాఘర్'[Bheraghar] యొక్కచుట్టుపట్లను మాహిష్మతీపురమును రాజధానిగాఁజేసి పాలించిరి.

♦ ఇది వింధ్యమున, బుట్టుచున్నది. దీనినే తపతియని కొందఱును, తపతి లోనికిం బ్రవహించు పూర్ణయని కొందఱును వాడుచున్నారు.

విద్ధసాలభంజిక

అరిదివిలాకుఁ డైన మురళభూవరుఁడు,

నీరంధ్రిసారాన్వితుండాంధ్రవిభుఁడు.

గీ. మఱియుఁ దక్కఁగలుగు మహీపతుల్ కొంకణ

పరిభృతులెల్లఁగూడి ప్రబలులగుచుఁ

దలపడంగను మనబలములకును దద్బ

లములతోడఁ దుముల సమరమయ్యె."

రాజు: కర్ణాటులు నైసర్గికముగానే సమరకర్మమునందు సముద్భటులు.

భాగు: (చదువుచున్నాఁడు) "అంత

సీ. కొమ్మకేనుఁగువట్టి కుర్మ్మంగ బాణముల్

వాయునీతఁడునాకుఁ బ్రేయసుండు.

ఈఁటెగుచ్చుకొనంగ నిసుమంత మిసిమింతుఁడును

గాని యితఁడు నాకును బ్రియుండు

మొండెమయ్యెఁ జెలంగి తాండవంబాడు

నీవైరివీరుఁడు నాకు వల్లభుండు.

తనకంఠ ముత్తరించినను మోమునబోమల్

ముడివైచువీఁడు నాముద్దులాఁడు

గీ. అనుచునీరీతి నప్సరోవసహస్రము

లాకసమునందు వరవరణాభిలాష

నాడుకొను ముచ్చటలనెల్ల నాలకింప

నట్టివారలుగలరె యయ్యవసరమున.

అతివిస్తరమెందుకు? వారలనోడించి వీరపాలుని స్వారాజ్యమునం బ్రతిష్ఠించితిమి. కొదువవిశేషములు కురంగకుని ముఖమువలనఁ దెలియఁదగును."

కురం: భర్తా! నాముఖము భేరీముఖమువలెఁ బలికించినఁ బలుకఁగలదు.

రాజు: అక్కఱలేదు. లేఖవాహులకు లేఖలే ముఖములు.

భాగు: కాబట్టి యిప్పుడు

శా. గంగాపావనసైకతంబుదధి ప్రా
గ్భాగంబునన్, నర్మదా
సంగంబౌవనరాశి వారుణి, యమా
శం దామ్రపర్ణీశుఁడున్
సాంగక్షేపనటన్మహానటజటా
జాలచ్యుతశ్రీవియ
ద్గంగాసంగిపయఃపయోనిధి యుద
గ్భాగంబునంగ్రాలు భూ
రంగంబేలెడుఁ జక్రవర్తియయి యీ
రాజన్యచంద్రుండహో.

(రాజువంకఁదిరిగి యంజలిపట్టి) ఇంకను దేవరకునేనెట్లు ప్రియముపకరింపఁగలను?

రాజు: ఇంతకన్నఁ బ్రియమేమిగలదు?

ఉ. దేవిప్రసన్నురాలుగను
దిద్దుకొనంబడెఁ; జేపడెన్ మృగాం